# కథావాహిని

## 14

రచన

ముద్దంశెట్టి హనుమంతరావు



ఆదర్శగ్రంథమండలి, విజయవాడ.

# అతి తెలివి

తారకరావుకి సంబంధ మొచ్చింది. మేనమామ రామారావు పెద్దరికం తీసుకున్నాడు. రామారావు అదో తరహా మనిషి. నక్కజిత్తుల్లో పైచే యతనిది. ఎలాగైనా మేనల్లుడికి లాభసాటిగా వుండేట్లు ప్రయత్నం చెయ్యాలనుకున్నాడు రామారావు. అందుకతని విపరీతమైన ఆలోచనలు సహాయపడ్డాయి.

"ఒరేయ్, తారకం......" నెమ్మదిగా పిల్చాడు రామారావు.

"ఏం మావయ్యా?" దగ్గరగావచ్చి కూర్చున్నాడు తారకరావు.

"టైం ఎంతయిందిరా?"

"తొమ్మిదయింది మావయ్యా! ఏం?" అన్నాడు తారకరావు చేతివాచీ చూసి చెప్తూ.

"ఏమీ లేదుగానీ, నువ్వీవాచీని అమ్మెయ్యాల్రా"

"అదేవిటి మావయ్యా; కొని మూడు మాసాలయినా లేదుగా... బాగానే నడుస్తూంది! అప్పుడే అమ్మెయ్య మంటున్నావేం!" ఆశ్చర్యపోతూ అన్నాడు తారకరావు. అతని కేం తెలుసు మేనమామ మనసులోని వ్యూహం!

"అదంతా నీ కెందుకురా—ఎవరైనా కొనుక్కునే వాళ్లున్నారో చెప్పూ!"

"లేకేం మావయ్యా! ఇప్పుడు కావాలంటే రొఖ్ఖం వడేసి మరీ తీసుకుంటారు ఈ షేపు వాచీలు దొరకటమే కష్టంట"

"అవుతే మరేం...కల్సివచ్చిం దన్నమాట! వీళ్లై నంత త్వరగా అమ్మేయరా. నష్టంరాకుండా చూడేం?" అన్నాడు రామారావు పొడుం కాస్త పీలుస్తూ. ఆ ఘాటు కాస్త తారకరావుకిసోకి తుమ్ముతున్నాడు.

"వెధవతుమ్ము, యిప్పుడే రావాలా?" విసుక్కున్నాడు రామారావు తన ప్రయత్నానికి అంతరాయం కలుగు తుందేమోనని. తారకరావుకి నవ్వు ఆగిందికాదు.

"మరి నేనేంచేసేది మావయ్యా, మీ పొడుం మజా అది...ఇంతకీ వాచీ యెందుకమ్మేయాలో చెప్పావుకాదు మావయ్యా"

"నీకు చెప్పాలేమిట్రా అన్నీను?" అన్నాడు రామా రావు కాస్త అధికారం కనబరుస్తూ.

"అదికాదు మావయ్యా! యీ వాచీమీద నా కింకా మోజు తగ్గలేదు. దీనిషేపు యెంతో బావుంది—దీన్ని అమ్మేయాలంటే కష్టంగానేవుంది" అన్నాడు తారకరావు మెల్లగా. రామారావు చిన్నగా నవ్వుతూ—

"పిచ్చివాడా! యింకా చిన్నతనంకదూ, నీకు తెలీదులే ...యిలాంటివి తెలీడానికి యెంత అనుభవం వుండాలి!" అన్నాడు రామారావు. అంతేగానీ విడమర్చి చెప్పలేదు. ఒక్కసారే చెప్పేస్తే అందులో గొప్పతనం వుండదని గామోను అతని అభిప్రాయం. తారకరావు కిదేం అర్థంకాలేదు.

"ఏమిటో నాకర్థంకాలేదు మావయ్యా" అన్నాడు తారకరావు.

"నీకు పెళ్ళిసంబంధం వచ్చిందికదటూ..." అన్నాడు రామారావు మేనల్లుడి మొహంలోకిచూస్తూ.

"అవుతే..."

"వాళ్ళే మరోపాటి కోనిస్తారు" అన్నాడు రామారావు గర్వంగా తన ప్రజ్ఞకి తనే మెచ్చుకుంటూ.

"నాకెలాగూ వాచీవుందికదూ! మరి వాళ్లు కొనివ్వట మెందుకు మావయ్యా!" అమాయకంగా అన్నాడు తారకరావు. రామారావు సీరియస్‌గా మొహంపెట్టాడు.

"చూడు తారకం...నీపాటి తెలివి తేటలు, అనుభవం, నాకు లేవనుకోక ఎందుకుచెప్పానో ఆలోచించు; వచ్చే మార్గంవుంటే యెందుకు రాబట్టుకోకూడదూ అంటా. వాళ్లెలానూ వాచీ యివ్వాలి. మనం వద్దనేస్తే మానేస్తారు, తప్పదు. మనం ఎందుకు వద్దనాలి? ఈ వాచీని అమ్మేశావనుకో, ఆ డబ్బు మన కింకో ఖర్చుకి పనికొస్తుంది"

"మనం అడిగితే యిస్తారంటావా, మావయ్యా?"

"ఎవరికోసం! నాళ్ళని పుట్టించిన బ్రహ్మదేవుడు సహితం యిచ్చితీరాలి. అంతేననుకోన్నావటూ! చూస్తూండు యెన్ని రాబట్టుకుంటానో! ఈ కాలం కుర్రాళ్ళకి పెళ్ళి సమయమే మంచి అవకాశం. ఏవిటేమిటి కావాలో అన్నీ అప్పుడే గుంజుకోవాలి, అంటే, అత్తారినుండి రాబట్టుకోవాలి. యిప్పుడలా వుంది కాలం..." అన్నాడు రామారావు నవ్వుతూ. తారకరావుని మామయ్యమాటలు ఆకర్షించాయి. ఓవేపు ఆశపుట్టింది, నిజమే! మావయ్యన్నట్టు వచ్చే అవకాశముుంటే యెందుకు మానేయాలి? తనకిమాత్రం తెలీదూ...

పరమేశంగారి అల్లుడు కారుకొనుక్కుందుకు డబ్బిచ్చేవరకూ పందిట్లోకి కదల్లేదు.-పరమేశం ఖచ్చితంగా యిచ్చాడా మరి...? మావయ్యన్నట్టు కాలంఅలాంటిది. తనెందుకూరుకోవాలి...? ఈ ఆలోచనానంతరం తారకరావు మెదడు చురుకుగా పని చేసింది.

“కాను మావయ్యా, నువ్వన్నది బావుంది... వాళ్ళేంకేవిటి ఇస్తారంటావూ?”

“కోరి ఎవరైనా యిస్తారుటో... ఎంత తగ్గితే అంత మంచిదని చూస్తారు. మనం అడగాలిగాని... నీకేవిటికావాలో చెప్పుదూ!” అన్నాడు రామారావు మీసం మెలివేస్తూ. నిజానికి ఎలా రాబట్టుకోవాలో రామారావుకి తెలుసు మరి.

“వాచీ ఎలాగూ యిస్తారంటున్నావు. సైకిలు కావాలి. ఉంగరం యిస్తారా!” మళ్ళీ సందిగ్ధం కలిగింది తారకరావుకి.

“ఎందుకివ్వరూ? నువ్వు చెప్పూ, ఏమిటేం కావాలో!” అన్నాడు రామారావు గుండెనిబ్బరంతో. మావయ్య అంత నిబ్బరంగా చెప్తూంటే తనకేం అనుకున్నాడు తారకరావు.

“ఉంగరం మంచిపొడులున్నది... ఓ అలారం టైంపీసు ఓ పార్కరు సిలివరు పెన్ను...” ఆగాడు తారకరావు. తనకే అగ్గఘలా అగ్నష్కీలా యివన్నీను.

“ఇంకా చెప్పరా... అనుమానమెందుకూ!” హెచ్చరించాడు రామారావు.

“ఇంకెందుకులే మావయ్యా! వాళ్ళయినా కొనివ్వాలా ...” అన్నాడు తారకరావు.

"ఏడిశావులే...నీకెందుకా కనికరం. ఇలాగసి కట్నం కూడా మానేయ్. ఎవడైనావింటే నవ్వుతాడు" అన్నాడు రామారావు, తారకరావుని రెచ్చగొడుతూ.

"పిలయితే, రేడియో ఒకాటి మావయ్యా" అన్నాడు తారకరావు అదే తన ఆఖరి కోరికలా.

"పిలవ్వకపోవడమేమిటి? అయ్యేటట్టు చేస్తాను. మొదట ఆ వాచీ అమ్మే యేర్పాటుచెయ్యి. నష్టం లేకుండా చూడు."

"ఈవాళే అమ్మేసి రొక్కం తీసుకొస్తానుగా...... యిప్పుడే మళ్ళీవస్తాను మావయ్యా" అంటూ ఉత్సాహంగా వెళ్ళిపోయాడు తారకరావు. రామారావు తన తెలివికి తనే ఆశ్చర్యపోతూ నవ్వుకున్నాడు.

## 2

మేనల్లుడి పెళ్ళి ప్రయత్నాల్లో రామారావు మాంచి తెలివితేటలు కనబర్చా లనుకొన్నాడు. ఇంతాచూస్తే ఆ తెలివితేటలు మరొహర్ని దోపిడీ చేసేందుకే ఉపయోగపడుతున్నాయి. ఓ రోజు రామారావు వధువుతండ్రి విశ్వనాథం గారింటికి వెళ్ళాడు. విశ్వనాథం అతన్ని ఆప్యాయతతో ఆహ్వానించాడు.

"ఏవండీ! ఇలా దయచేశారు!" అన్నాడు విశ్వనాథం. రామారావు అలసిపోయినట్టుగా ఓ నిట్టూర్పు విడుస్తూ కుర్చీలో కూర్చున్నాడు.

"అన్నీ బాగానే వున్నయ్ కాని, మీ అల్లుడు మాత్రం పై మెట్టులో ఉన్నాడండీ విశ్వనాథంగారూ!"

"అంటే?" రామారావు వ్యంగ్యపదాలు మొపరి కర్ధమవుతాయి గనక. విశ్వనాథంగారికికూడా అర్థంకాలేదు.

"మరేం లేదులెండి...యీకాలపు కుర్రాళ్లుకదూ! ఏమిటో అదికావాలి, ఇదికావాలి, అని కోరుతూంటారు. ఎవరో ఉన్న మహారాజులు యివ్వటంమూలాన, యీ లాంఛనాలు తప్పనిసరి అయిపోయాయి యిప్పుడు" డొంకతిరుగుడుగా తన అభిప్రాయం చెప్పాడు రామారావు. విశ్వనాథం అర్థం చేసుకోగలిగాడు. మహాకావాలంటే ఓ సైకిలు కోరుకుంటాడు గామోసు...త నెలాగూ యివ్వాలనుకుంటున్నాడు.

"అవుతే అబ్బాయి ఏం కావాలంటున్నా డేవిటండీ?" అన్నాడు విశ్వనాథం నవ్వుతూ. రామారావు సందిగ్ధంలో పడ్డాడు—యేవిటి మొదట చెప్పాలా అని. కాస్సేపు పూరుకుని,

"సైకిలు కావాలటండీ..." అని యింక తక్కినవి కూడా ఓ వరుస చెప్పాలనుకున్నాడు. కాని విశ్వనాథం అడ్డొచ్చి—

"నే నా అభిప్రాయంతో నేవున్నానండి...నాకు మాత్రం తెలీదూ!" అన్నాడు తన అభిప్రాయం స్థిరమైనందుకు వుత్సాహితుడై.

"అదొక్కటే కాదులెండి" చెప్పక తప్పిందికాదు రామారావుకి. విశ్వనాథం గుండెలో రాయిపడింది. ఇంకేవిటున్నాయో కోరికలు!

"ఇంకేవిటండీ!" ఆశ్చర్యంగా అడిగాడు.

"చేతికి వాచీ లేదంట..." ఇంకా రామారావు చెప్ప బోతూంటే విశ్వనాథం గ్రహించి

ఆరోజు మేం మీాయింటి కొచ్చినప్పుడు అబ్బాయి చేతికి వాచీ వుండాలికదండీ!" అన్నాడు విశ్వనాథం. రామా రావు తికమకపడ్డాడు. తనకంటె ఘనుడులావున్నాడే యీా యన– అనుకున్నాడు మనసులో. అలాగని దొరికిపోతాడా?

"అది వాడిదనుకుంటున్నా రేవిటి! అలాంటిదికొనమని నన్ను విసిగించేస్తున్నాడు. నమూనా చూపించాలని తీసు కొచ్చాడు" అన్నాడు రామారావు నవ్వుతూ. తడుముకో కుండా, ధారాళంగా అబద్ధం చెప్పటం అతనికి మొదట్నుంచీ అలవాటే.

"సరే లేండి, మరేంచేస్తాం. అల్లుడు కావాలంటే ఆయన కోరినవన్నీ యివ్వాలి. అలాగని హిరణ్యాక్షవరాలడి గితే బ్రహ్మకే తరంకాదు. కాస్త మీారైనా ఆలోచించండి. యీా రోజుల్లో ధరలు ఎలా పెరిగిపోతున్నాయో! యింకేమైనా బాకీ వున్నాయా!" అనుమానంగానే వుంది విశ్వనాథంకి. రేడియో అడగటం పరిపాటు కదూ! కొంపదీసి అదీ అడిగివుం టాడేమోనని భయం. అవుతేనేం, రామారావు చాలా చురు కుగా ప్రవర్తించాడు. ఇప్పటికే గుండెబాదుకుంటున్న విశ్వ నాథంను అప్పట్లో రేడియో అడగటం మంచిదికాదను కున్నాడు.

"ఇంకేవిటి లెండి–ఓ సీనియర్ పార్కరుపెన్ను...ఏం మహాభాగ్యం! ఓ అలారం టైంపీసు, అంతే. మరి వుంగరం

యెలాగూ మీా రిస్తారు. శాస్త్ర మంచిపొడులది చూసి తీసుకోండి" అనేశాడు గుక్కతిప్పకుండా. చెప్పకోవాలంటే విశ్వనాథంకి రామారావుమీాద తగనికోపంవచ్చింది చప్పన అతనిమీాద నులిమేయాలన్నంత వుద్రేకం వుప్పొంగింది. కాని యిన్నాళ్ళకి కుదిరిన సంబంధం చేతులారా విడిచిపెట్టు కోవటమే!

"అంత సులువుగా చెప్పేశారుగాని రామారావుగారూ, యివన్నీ కలిపితే యెంతమొత్త మవుతుందో, ఆలోచించారూ? మళ్ళీ కట్నంలో ఓకానీ తగ్గిస్తే ఒప్పకోరు. ఎంత వరుల గిరాకి రోజులయినా, యింత దురాశ వుండకూడదనుకుంటాను. మాట కనుకుందాం... మీాకూ ఓ కూతురుంటే యివన్నీ యిచ్చేవారేనా?" అన్నాడు విశ్వనాథం కోపాన్ని నిగ్రహించుకోలేక. రామారావు స్తబ్దుడై పోయాడు. ఇల్లాంటి ఎదురు ప్రశ్న విశ్వనాథం నోటినుండి వస్తుందనుకోలే దతను.

"తప్పనిసరవుతే మరి, యిచ్చుకోక యేం చేస్తాం చెప్పండి...యిచ్చుకోవాలి. నే నవుతేమాత్రం యెక్కువా?" అన్నాడు రామారావు. తనకి కూతుళ్ళు లేరు కాబట్టి నిశ్చింతగా అనేశాడు. లేకపోతే తనిచ్చుకునేవాడేనా! విశ్వనాథం మరేం వాదించలేదు.

"సరేలెండి... మరేంచేస్తాం, వరుని తరఫువాళ్ళదే గెలుపు" అన్నాడు. రామారావు ఆశయం నెఱవేరింది. ఎంతో ఆనందించాడు. ఇంక అక్కడెందుకుండాలి?

"వస్తానండి మరి..." అంటూ వెళ్ళిపోయాడు రామారావు. విశ్వనాథంకి వళ్ళుమండిపోయింది. రామా

రావే యిదంతా జరిగిస్తున్నాడన్న అభిప్రాయాని కొచ్చేశాడు. అందుకే రామారావు వెళ్ళిపోతున్నప్పుడు కనీసం కాఫీ తాగి వెళ్ళమనైనా అనలేదు.

రామారావు పరిపూర్ణంగా విజయం పొందలేక పోయినా, ఓడిపోలేదు. అనుకున్న వాటిలో మూడువంతులు ఫలించింది. కార్యశూరత గలవాడనే చెప్పుకోవాలి. మరి ఆ ఒక్క రేడియో రప్పించుకుంటేనేగాని, తనకి పూర్తిగా విజయం కాదు. ఆ రేడియో రప్పించుకోవటం యెట్లా? తీవ్రంగా ఆలోచించాడు. చటుక్కున వుపాయం తట్టింది. తనలోతనే నవ్వుకుని ముందుకి సాగిపోయాడు.

## 3

విశ్వనాథంగారింట్లో పెళ్ళిప్రయత్నాలు మహా అలజడిగా జరుగుతున్నయ్! వస్తున్న బంధువులు ఆరోజు వరకూ వస్తూనే వున్నారు. సరిగ్గా పెళ్ళినాటికే శ్రీనివాసం కూడా వూడిపడ్డాడు. శ్రీనివాసం విశ్వనాథంకి బీరపీచులాంటి చుట్టం. అంత సన్నిహితుడైనందుకు శాస్త్ర ముందు రావల్సిందే కాని వీల్లేకపోయింది. మనిషి చూడ్డానికి గంభీరంగా అగుపిస్తాడు కాని, పెద్దమనిషితరహా ఆతనిలో మూర్తీభవించి వుందేమోననిపిస్తుంది.

“సరిగ్గా వేళకి రాకపోతే, ఒకరోజు ముందువస్తే యేం పోయిందోయ్” అన్నాడు విశ్వనాథం శ్రీనివాసాన్నుద్దేశిస్తూ.

“తీరిక వుంటే రానూ...తీరికలేకే రాలేదోయ్... ఎంత వీలుచూసుకుందామన్నా, యేదో ఒక అంతరాయం

కలుగుతూనే వుండేది" అన్నాడు శ్రీనివాసం. విశ్వనాథం యింకేమనగలడు? కాస్సేపు యిద్దరూ మౌనంగా వూరుకున్నారు.

"ఆ! అన్నట్లు యెవరా వరుడు?" అడిగాడు శ్రీనివాసం.

"ఎవరస చెప్పను... వాళ్ళవాళ్ళెవ్వరూ నీకు తెలీదు. ఆ అబ్బాయికి తండ్రి లేడులే. మేనమామ యింట్లో వుంటున్నాడు."

"అవుతే కట్నం యేపాటి?"

"మామూలేగా – వేయినూట పదహార్లు."

"ఊ! యింకేం యితర లాంఛనాలున్నాయా?"

"లేకేం. కావల్సినవన్నీ జాబితాలా చెప్పారు."

"ఏమిటో?" ఆసక్తిగా అడిగాడు శ్రీనివాసం. యిలాంటివి వింటమంటే అతనికి సరదా.

"ఓ వాచీ, ఓ సైకిలు, సీనియర్ పార్కరు, అలారం టైమ్‌పీసు, ఇంకా వుంగరం..." అంటూ ఆపేయబోతున్నాడు విశ్వనాథం. శ్రీనివాసం ఆశ్చర్యపోతూ అడ్డొచ్చి–

"ఇంకేమైనా వున్నాయా?"

"లేవోయ్."

"ఏమిటీ హిరణ్యాక్షువరాలు? అన్నీ యిప్పుడే రాబట్టుకోవా లనుకుంటున్నారా? నువ్వు ఒప్పుకున్నా వేమిటోయ్" అన్నాడు శ్రీనివాసం కాస్త కోపంగా. అతని కిల్లాంటి నిర్బంధ లాంఛనాలంటేనే వళ్ళుమంట.

"ఒప్పుకోక, మరేం చేస్తాం చెప్పు...? యింక యెన్నా

ళ్ళని అమ్మాయి నింట్లో వుంచుకుంటాం ?"

"బావుంది వరస...ఆశకి అంతం అంటూ వుండాలా మరి...ఆ అబ్బాయికి అవసరమైనవన్నీ యిప్పుడే సమకూర్చు కుంటున్నారన్నమాట....ఇంకో మాటి మర్చిపోయారు.

"ఏమిటి శ్రీనివాసం?"

"రేడియో - అదీ అడిగేస్తే పూర్తవుతుం దా వరాల జాబితా" అన్నాడు వ్యంగ్యంగా శ్రీనివాసం. విశ్వనాథంకి నవ్వాగింది కాదు.

"నేనూ, అదే అనుకొన్నానోయ్...వాళ్ళు ధర్మ మంటూ రేడియో అడగలేదు" అన్నాడు విశ్వనాథం నవ్వుతూ

"ఇప్పుడడగలేదని కులుకుతున్నావుగాని, మరోసా రెప్పుడో గుంజుతారులే. నీలాంటి ఇచ్చే మహానుభావులుంటే తీసుకునేవాళ్ళకి కొదవేమిటి" అన్నాడు శ్రీనివాసం నవ్వుతూ.

"అలాగనే అంటావుగాని పరిస్థితి ఆలోచించావు కాదు. ...సరేలే, అవన్నీ తరవాత మాట్లాడదాం. లేచి స్నానం చేయవోయ్. వడ్డనలకి తయారవ్వాలి" అంటూ విశ్వనాథం బయటికి పోయాడు. శ్రీనివాసం పంక్తులోంచియింట్లోకివెళ్లాడు.

పెండ్లికొడుకు వూరేగింపుతో తరలి వధువు యింటికి వచ్చాడు. తారకరావు [పెండ్లికొడుకు] పందిట్లో ఓ చివర కుర్చీలో కూర్చున్నాడు. రామారావు తన తెలివితేటలన్నీ యిప్పుడు చూపించాలనుకున్నాడు. ఎలాగైనా రేడియో కూడా రాబట్టుకోవాలని అతని సంకల్పం.

"ఒరేయ్ తారకం, యిప్పుడు మంచి నాటకమాడాలిరా" అన్నాడు మెల్లిగా యెవ్వరూ వినకుండాను. తారకరావుకి భయంవేసింది, యింకా నాటకమంటూ దేవిటా, అని.

"ఏవిటి మావయ్యా?"

"నిన్ను పౌరోహితుడుగాని, యింకెవరుగాని పెండ్లి పీటలమీదికి రమ్మంటారనుకో...వెళ్ళకు...అంతే, తక్కింది నేను చూసుకుంటాను" అన్నాడు రామారావు. మేనమామ మాటలకి చకితుడయ్యాడు తారకరావు. కాదూ మరి! అన్నీ నిశ్చయమయ్యాంతరవాత 'పెండ్లిపీటలమీదికి వెళ్ళకు' అంటే యేమన్నా అర్థంవుందీ?

"ఏం మావయ్యా?"

"రేడియో యెలా వస్తుందిరా మరి...నీ కెందుకు—నువ్వు నిశ్చింతగా కూర్చో, నేను చూసుకుంటాను" అన్నాడు రామారావు.

"ఏవిటో మావయ్యా, నాకు భయంగావుంది." అన్నాడు తారకరావు. నిజమే! భయంకాదూ! బొమ్మల పెళ్ళిళ్లాయేం? నలుగురిలో నగుబాటవుతుం దేమోనని అతని భయం. కాని మావయ్య తెలివితేటలు సహాకారిగా వుండొచ్చనుకున్నాడు. మేనల్లుడి మాటలకి రామారావు నవ్వేసి "నీ కన్నీ భయమేలేరా" అంటూ హడావిడిగా వెళ్ళిపోయాడు.

పౌరోహితుడు వరుణ్ణి పీటలమీదికి రమ్మన్నాడు. ఎవరూ అక్కడ లేకుండానే యేవేవో మంత్రాలు చదివేస్తున్నాడాయన. ఎవరికి తెలుసుగనక యేంచదువుతున్నాడో!

అదేసమయమనుకుని రామారావు ఓసారి తారకరావు దగ్గరికి వెళ్ళి యేమీ అడక్కుండానే యేదో గొణుక్కుంటూ విశ్వనాధం దగ్గరికి వచ్చాడు.

"ఈకాలపు కుర్రాళ్ళతో యిదే చిక్కండీ... పెద్దల మాటలు కాస్తయినా చెవినిపడనియ్యరు" అన్నాడు గాబరాగా, తనెంతో ఆందోళన పడుతున్నట్టుగా.

"ఏమయిందండీ?" అన్నాడు విశ్వనాధం బెదిరిపోతూ.

"అటు తరుణం మించిపోతోంది. వెధవని పెండ్లిపీట మీదికి వెళ్ళమంటే ససేమిరా వెళ్ళనంటున్నాడు. ఎంతని బోధపర్చేది!" అన్నాడు రామారావు. విశ్వనాధం స్థంభించిపోయాడు. మాట్లాడలేకపోయాడు. వళ్లంతా చెమటపోసింది.

"ఎందుకు వెళ్ళనంటున్నాడండీ?" ఆత్రంగా అడిగాడు. ఆత్రతకాదూ మరి...యిన్ని యేర్పాట్లు చేసుకున్నాక ఆటంకమా?

"ఏమిటో! ఈకాలపు కుర్రాళ్లు కదండీ, పెడసరం హెచ్చు...కోరికలు అంతకు మించివుంటయ్..మొన్న అవస్టిను కావాలన్నాడా, యిప్పుడు రేడియో యిచ్చేవరకు కదల్నంటాడు"అన్నాడు రామారావు. అక్కడికి తనకేం తెలీనట్టుగా. విశ్వనాధం వుద్రిక్తుడైపోయాడు. తన మంచితనంచూసి యిలా ఆడించుతున్నారేమో ననుకొన్నాడు.

"ఏమిటండీ, రామారావుగారూ! మీరైనా ఆలోచించారా? ఆ అబ్బాయికి ఆపాటి వూహించేజ్ఞానం లేకపోతే మీకైనా వుండొద్దూ! మొదట్లో మీరిచ్చిన జాబితాలో రేడియో మాటేలేదే. అప్పుడే అడిగివుంటే నేనీసంబంధమే

చెప్పకొనేవాణ్ణికాదు. రేడియోఅంటే కానీయా, పరకా! అయినవందలు పెట్టందే రాదు. యివ్వడంటే యేలాంభం! నేను కొనివ్వలేను సుమండీ... అన్నాడు ఆవేశంగా. ఆ ఆవేశంలో రామారావు బుద్ధిహీనతకూడా కనబర్చాడు

"అలాగంటె యెట్లాగండీ! నా డొకేకాలుపై కూర్చు న్నాడు. లేకపోతే లేచిపోతానంటున్నాడు" అన్నాడు రామారావు, విశ్వనాధాన్ని భయపెట్టాలని. విశ్వనాధం నిజంగా భయపడ్డాడు. అది అతని కో పరీక్షాసమయం. రామా రావన్నట్టు వరుడు తిరిగిపోతేనో! ఇక తన కూతురికి వివాహం జరగటం కల్లోమాట...అనుకొన్నాడు విశ్వనాధం. అవుతే యిప్పుడేంచేస్తాడు? తీవ్రమైన ఆలోచనలోపడ్డాడు, అదృష్టవ శాత్తూ శ్రీనివాసం అక్కడికి వచ్చాడు. విశ్వనాధంకి కాస్త ధైర్యం కలిగింది.

"ఏమిటోయ్ విశ్వనాధం ఆలోచన? అటు ముహూర్తం మించిపోతుంది వరుడు రావాలిట" అన్నాడు శ్రీనివాసం. అతని గంభీరమైన ఆకారంచూసి యెందుకో రామారావు కాస్త భయపడ్డాడు.

"రేడియో కొనిచ్చేవరకూ వరుడు పెండ్లిపీటమీదికి రాడుటోయ్" అన్నాడు విశ్వనాధం. శ్రీనివాసం యెదురుగా వున్న రామారావువేపు గుడ్లురుముతూ చూశాడు.

"మీరేనాండి, అబ్బాయి మేనమామగారు!...నామ మాత్రానికి అతన్నివుంచి మీరే యీనాటకాన్నంతా ఆడు తున్నట్టుందే! ఇప్పటికడిగినవి తక్కువై పోయాయనా మిగిలింది చెప్పేశారు! ఏదీ, నేనే ఆ అబ్బాయి నడుగుతా"నంటూ చర

చరా పెండ్లి కొడుకుదగ్గరికి పోయాడు. అంతవరకూ ధైర్యంగా నాటకమాడుతున్న రామారావు వణికిపోయాడు. అంతమంది సముఖంలో నగుబాటు కావలసివస్తుందేమోనని భయపడ్డాడు కూడా. శ్రీనివాసం ఒకపాళాన వదలడేమో ననుకున్నాడు.

శ్రీనివాసం పెద్దఅంగలు వేసుకొని తారకరావు దగ్గరికి పోయాడు. తారకరావుకి తలపై పెద్దపిడుగు పడ్డట్టయింది. శ్రీనివాసాన్ని ఎదిరించి చూడలేకపోయాడు.

'ఏమోయ్, రేడియో యివ్వందే పీటమీదికి రానన్నావుటగా. యింకేవిటి మిగిలాయో చెప్పు?" అన్నాడు గంభీరంగా. మొదలే భయపడుతున్న తారకరావుకి అతనికంఠం విని మరీ వణుకుపుట్టింది.

అప్పటికే యెంతోమంది చుట్టూ మూగారు. తారకరావు బట్టలు చెమటతో తడిసిపోయాయ్. నోటమాటరా లేదు. మామయ్యవేపు చూశాడు. రామారావు గుటకలు మింగుకుంటూ యేదో చెప్పాలని ముందుకొచ్చాడు.

"మీరూరుకోండి...చెప్పేదేవో ఆయన్నే చెప్పనీండి— ఏమయ్యా చెప్పవేం? బొమ్మలపెళ్ళి అనుకొంటున్నారా, మీయిష్టమొచ్చినట్లు ప్రవర్తించటానికి... నడువు పిచ్చివేషాలు వేయక" అని గర్జించాడు శ్రీనివాసం. అప్పటికే నలుగుర్లో అవమానం పొందినట్టుగా ఫీలయ్యాడు తారకరావు. మారు మాటాడకుండా, మామ ముఖమైనా చూడకుండా నడిచాడు. అందరూ గుసగుసలాడుకొంటున్నారు. రామారావు చిన్న బుచ్చుకున్నాడు. అతని తెలివితేటలు శ్రీనివాసందగ్గర పనికిరా లేదు. అతన్ని యెదిరించే ధైర్యం లేకపోయింది.

శ్రీనివాసంకి రామారావు వాదోపం కట్లు తెగి ప్రవహించింది. ప్రతీకారం చెయ్యాలనుకున్నాడు. వెధవ! యెంతదురాశవీడికి? యెన్ని డిమాండులు! ఒకటా రెండా.. తగినశాస్తిచెయ్యాలనుకున్నాడు శ్రీనివాసం. అగ్నిసాక్షిగా వివాహం జరిగిపోయింది.

శ్రీనివాసం ప్రోద్బలంవల్ల వరుడికి ఒక్కసైకిలే యివ్వబడింది. విశ్వనాథం మొదట్లో కాస్త జంకినా, శ్రీనివాసంఆసరా చూసుకొని ధైర్యం తెచ్చుకున్నాడు. రామారావు కాలు కాలిన పిల్లిలా లేచాడు... రేడియో లేకపోతేపోయె తక్కువైనా యిమ్మన్నాడు.

"ఇదేం ధర్మసత్రవు కాదండీ, మీరడిగినవన్నీ నేం యివ్వడానికి! మీరడగటానికి హద్దూ, పద్దూ వుండాలి... మీహిరణ్యాక్షవరాలు ప్రసాదించడానికి బ్రహ్మదేవుడే దిగి రావాలి" అన్నాడు శ్రీనివాసం అంతమందిలోనూ. ఏం చేయాలో రామారావుకి తోచలేదు మేనల్లుణ్ణి తీసికొని తిరిగి పోదామంటే వివాహం జరిగిపోయింది. అంతమందిలోనూ శ్రీనివాసంతో వాదిస్తే తనకే వోటమివస్తుందని తెలిసి యేం చేయలేక వూరుకున్నాడు రామారావు అతితెలివితేటలు చూపించి మేనల్లుడి మెప్పుపొందాలనుకున్నాడు. కాని దాని పర్యవసానం యిలా యేడ్చింది.

చివరికి వరుడికి లభించిం దొక్క సైకిలే; వున్న మంచి వాచీకూడా అమ్ముకున్నందుకు విచారించాడు తారకరావు. మరోవాటి కొనుక్కుందాంలే అని ధైర్యం చెప్పాడు రామారావు. ఇలాంటి దురాశాపరులు యిప్పటికీ మన సంఘంలో వున్నారంటే అతిశయోక్తి వుండదు. ఏమంటారు?

# విశ్వాసఘాతుకులు

పొయ్యిమీది అన్నం మెత్తనయిపోతుందేమోనన్న భయంతో చంటిపిల్లను మంచంమీదవేసి పొయ్యి దగ్గరికి పోయింది సరోజిని. చంటిపిల్ల మరింత గోలచేస్తూ అప్పుడప్పుడు దీర్ఘంగా గుక్కపడుతూ యేడుస్తూంది. అన్నం వార్చేనంత వరకు పిల్లను తియ్యటానికి వీలుచిక్కిందికాదు. అప్పుడు సరోజినికి చాల విసుగనిపించింది. ఒకప్రక్క చంటిపిల్లతో వేగడం కష్టంగావుంటే మరోవేపు నలుగురు మనుషులకు వంటకావాలి. ఇది దినచర్యలలో ఓ పెద్ద సమస్యగా తయారయింది.

ఉదయం యేడుగంటలకు ఆఫీసుకుపోయిన జోగారావు పదకొండుగంటలకు ఇల్లుజేరుకున్నాడు. ఎప్పుడూ అదే సమయానికి రావటం అలవాటు. భోజనంచేసినవెంటనే కొంతసేపు విశ్రాంతి తీసుకుని పన్నెండు గంటలకు తిరిగి పోయేవాడు. రావటంతోనే అడిగాడు—

"పిల్ళింకా రాలేదూ?" మేజోళ్ళు విప్పుతూ. "లేదు.." ముక్తసరిగా జవాబు చెప్పింది సరోజిని. ఆ జవాబులో విసుగును గుర్తించగలిగాడు జోగారావు. మరింకేమనలేదు— సరోజినికోపం ఇంకా తగ్గలేదు. మనసులోని అక్కసును బయటికి వెళ్ళగక్కకుండా వుండలేకపోయింది.

"నే నింక యీ యింట్లో వుండలేనండీ—ఇటు చంటిపిల్ల గోలచేస్తూనే ఉంటుంది, ఒక్క ఘడియకూడా చంక దిగదు. ఎప్పుడూ ఎత్తుకుంటేనే వూరుకుంటుంది. లేకపోతే రణ

ఖేరిలా ఒకటే ఏడుపు...ఈ పిల్లను పెట్టుకుని నే నెలా వంట చేసేది!''.అంది కోపంగా.

సరోజినికి విసుగుపుట్టినప్పుడల్లా యీ ధోరణిలో మాట్లాడ్డం పరిపాటేనని జోగారావుకు తెలుసు. నిజమే ! తనకుమాత్రం తెలియదూ? చంటిపిల్లని సంబాళించుకోటం కష్టమని—పోనీ ఒక వంటమనిషిని పెట్టుకుందుకైనా తనకు దొరికేన జీతం ఎంతని? అందులోనే నలుగురువ్యక్తులు, ఓ చంటిపాప జీవించాలి—పరధ్యాన్నంగా ఇవన్నీ ఆలోచించుకుంటున్నాడు జోగారావు. భర్త యింకా యేం జవాబు చెప్పకుండానే మళ్ళీ మొదలుపెట్టింది సరోజిని.

"తెలీకడుగుతాను-మనం తెచ్చుకొనేది మనకే చాల కుండావుంటే వీళ్ళిద్దరెందు కింకా? వాళ్ళకుకూడా అడుగులకు మడుగులొత్తుతూ తిరుగవలసిన ఖర్మ పట్టుకుంది నాకు. నా కెందుకండీ యీ తగలాటం? హాయిగా మనం బ్రతక్కుండా...'' అంది విసురుగా.

జోగారావు మాత్రం యేమంటాడు? భార్యను క్రమంగా మంచి మాటలతో మార్గానికి తీసుకురావాలనుకున్నాడు.

"అలాగంటే యెలా సరోజినీ! వాళ్ళు మాత్రం యింకెక్కడికి పోతారు? తల్లీ—తండ్రీ! అంతా నేనేగా. తండ్రి తరువాత తండ్రిలాంటివా డన్నయ్య అన్నారు పెద్దలు..." యింకేమో చెప్పబోతూ వుంటే అర్ధోక్తిలోనే అందుకుంది సరోజిని.

"ఏం? మీ దగ్గర యెల్లకాలం కూర్చుని తెగతినటానికి బాండు వ్రాయించుకున్నారా ? మీ అన్నయ్య కూడా యీ

వూళ్ళోనే వున్నారు కదూ! అక్కడ కొన్నాళ్లు వుండమని చెప్పకూడదూ!"

"నువ్వు చెప్పింది సబబుగానేవుంది సరూ! కాని యేం చేయను? మా అన్నయ్య సంగతి నీకు తెలీదు. పెళ్ళాం చేతిలో కీలుబొమ్మ. ఒక్కఘడియ యెవరినీ యింట్లో వుండనీయదు దావిడ. నేనూ వాళ్ళలా పొమ్మంటే, యీ విశాల ప్రపంచంలో వాళ్ళకి తావేదీ? నిజంగా వాళ్ళను చూస్తుంటే నా కొక్కొక్కసారి జాలివేస్తుంది కూడా. సరియైన చదువా చెప్పించలేకపోయాను-వుద్యోగమూ లేదు. ఎందుకూ పనికిరాని వాళ్ళల్లా తయారయ్యారిద్దరు—" హృదయంలో యిమిడి వున్న బాధనంతా మాటల్లోనే చెప్పాడు జోగారావు.

"ఇప్పుడేదో వుద్యోగం చేస్తున్నారుగా...!" అంది జవాబుకై యెదురుచూస్తూ.

"ఆ! చేస్తున్నారు. వూరికే కూర్చోట మెందుకని నాకు తెలిసిన షాపులో వుద్యోగాలు వేయించాను. నెలకు చెరో యిరవైరూపాయలు ముట్టుతాయ్"

"అంతమట్టుకు తెచ్చుకుంటున్నారన్నమాట! అయితే అది కూడా ఖర్చుపెట్టేస్తున్నారా!" ఆశ్చర్యం ప్రదర్శిస్తూ అడిగింది,

"ఏదీ! వాళ్ళసలు నలభై రూపాయ లెక్కడిస్తున్నారు? ఓ నెల యిద్దరూకలిపి పదిహేనిస్తే మరోనెల పదిస్తారు. నోరు విడిచి నే నెలాఅడిగేది? అథవా అడిగానా యేదో ఒక సాకు చెప్తుంటారు. తోబుట్టువైయుండి భోజనానికని యెలా డబ్బడుగుతాను?"

"బావుంది మీ వరస—యిన్నాళ్ళూ పెంచి పెద్దవాళ్ళనుగాచేశారు. వారు దమ్మిడీఅయినా గడించని రోజుల్లో మీరడిగారా? అడిగినా వాళ్ళిచ్చేవారా? వాళ్ళు యిప్పుడు గడిస్తున్నారుకాబట్టి, ఆ డబ్బుఅంతా తెచ్చి మీ చేతుల్లో పెట్టే బాధ్యత వాళ్ళది- అలా వారివ్వనప్పుడు అడిగిపుచ్చుకునే అధికారం మీకుంది. పరాయివాళ్ళు కాదుగా! తోబుట్టువులు మళ్ళీ-ఆ మాత్రం అభిమానం లేదూ మీరంటే?"

"అభిమానం యెందుకు లేదూ! కావలసినంత వుంది. నేనంటే యెంతో నమ్రతగా, భయంతో తిరుగుతారు; చూస్తున్నావుగా."

"మీరలా అనుకుంటున్నారు. అది మీ వూహామాత్రమే! మీరింట్లో లేనప్పుడు వాళ్ళచర్యలు చూస్తే యింట్లో నుండి వెళ్ళగొట్టాలని బుద్ధిపుడుతుంది" అంది సరోజినికోపంగా.

జోగారావు నిస్పృహ చిక్కుప్రశ్న యెదురైంది. తను యింట్లో వున్నప్పుడు మూతులు మూసుకుని మారుమాటాడకుండా కూర్చునే తమ్ములచర్యలు, సరోజినికంత కష్టంగావున్నాయంటే సమస్యకదూ మరి—ఏం జవాబు చెప్పలేక చేతులు నులుముకుంటూ కూర్చున్నాడు జోగారావు.

వేణు, హరి అప్పుడే వచ్చారు వేణు పెద్దవాడు—హరి చిన్నవాడు. వేణుకు శాస్త్ర ప్రపంచజ్ఞానం వుండటంవల్ల మానవ సంఘంలోని బాధలు అర్థంచేసుకోగలుగుతున్నాడు. శాంత అణకువతో అందరిదగ్గర ప్రవర్తిస్తుంటాడు. కాని హరి ప్రవర్తన అతనికి వ్యతిరేకం. చిన్నా, పెద్దా లేకుండా నోటికొచ్చినట్లల్లా కుయ్యటం, తను మహా విద్యావంతుడల్లే.

యింగ్లీషు ముక్కలు రానివికూడా తప్పులతో కుయ్యడం— ఒక్కమాటలో చెప్పాలంటే తనకుతనే గొప్పగా భావించు కుంటాడు; ఇద్దరూ ద్వారంవరకూ పకపక నవ్వుతూ లోపలికి ప్రవేశించారు. ఎదురుగా అన్నయ్య జోగారావు కనిపించ టంతో నవ్వు ఆగిపోయింది.

జోగారావు యీ సంఘటన విస్మయంగా చూచాడు. భార్య మాటల్లోని నిజం అర్థంచేసుకోగలిగాడు. గాని తనూ ఆమెతోపాటు వాళ్ళను తిరస్కరించి, నిరసన చూపితే వారికి తావెక్కడుంది? అన్నవూహ అతన్ని కలవరపరిచింది.

అన్నదమ్ములు ముగ్గురూ వరుసగా కూర్చుని తింటు న్నారు. హరి కొంత అన్నం తినేసి వదినవేపు తిరిగి, "మజ్జిగ వుంటే వెయ్యి వదినా..." అన్నాడు.

"మజ్జిగలేదు. మీ అన్నయ్యకే లేకపోతే నీకెక్కడ నుండి వస్తుంది?" అంది మూతివిరుచుకుంటూ. ఆమె మనసు లోనిమంటలు మరింత ప్రజ్వరిల్లాయి. "ఎప్పుడూ వుండదు మనింట్లో" అన్నాడు హరి విసుగ్గా.

సరోజిని ముఖం ఒక్కసారి భర్తవేపుతిప్పి తీక్షణంగా చూసింది. జోగారావు యేం ప్రళయం ముంచుకొస్తుందోనని భయపడ్డాడు.

"హరీ! నీకింకా పరిస్థితులు తెలీవు. ఇప్పటికే మన కాఫీలకవుతున్న పాలు, చంటిపిల్లకోసం పాలు కొనలేక తిప్పలు పడుతూవుంటే మజ్జిగ యింకెలా వస్తుంది? నన్ను చూస్తున్నావుగా— నేనింతగా ఆర్జిస్తున్నా అంతవరకు సాగ లేకపోతున్నా. పోనీ మీరైనా వచ్చిన జీతమంతా యిస్తు

న్నారాఅంటే అదీ లేదు— నేను మాత్రం యెక్కడనుండి తెస్తాను...?" అన్నాడు జోగారావు నెమ్మదిగా బోధపరిచే పంథాలో. హరి నోరు పెగలలేదు మరి.

"మీరు మరింత వాళ్ళను లాలించుకు తిప్పాలేం టేసరి" అంటూ చరచరా పోయింది వంటగదిలోకి సరోజిని.

సరోజిని అందరు యిల్లాళ్ళవలె కాకుండా శాంతమూర్తి అవటంవల్ల యింతవరకైనా తాము యింట్లో నిలవగలిగామన్న విశ్వాసం లేకపోయిం దా యిరువు రన్నదమ్ములకు.

హరిలో మార్పు లేకపోయినా, వేణుమనసు చివుక్కుమంది. అనవసరంగా అన్నయ్యమనసు బాధపెట్టామే— అన్నభావం వుంది గాని, ఒకవేపు తమ్ముడివాదనకూడా బాగానే వుందనుకున్నాడు. ప్రతివిషయంలోను వదిన అలా మాటివిరుచుకుంటూండటం గమనిస్తూనే వున్నాడు. అయినప్పటికీ తమ్ముడినిమాత్రం ప్రోత్సహించలేదు.

## 2

"చూశారండీ! మీ చిన్నతమ్ముడి పేలాపన?" అంది సరోజిని వక్కపొడి అందిస్తూ. అప్పటికే వేణు, హరి భోజనం ముగించి వెళ్ళిపోయారు. జోగారావుకూడా విశ్రాంతితీసుకుని వెళ్ళేందుకు సిద్ధంగా వున్నాడు. భార్య అన్నమాటలు చెవిని పడ్డాయిగాని వినిపించనట్లే వూరుకున్నాడు.

"మీ కేనండీ చెప్తూంది. మీరున్నారుగాబట్టి యివ్వాళ గుప్ చుప్‌గా తినిపోయారు అధిక ప్రసంగం లేకుండా. అదీ వాళ్ళు ఆలస్యంగా రాబట్టి. లేకపోతే ప్రతిదివం యిదో యమ

లోకం... మీరు రాకమునుపేవచ్చి తెగవాగుతూ, పాడుతూ భోజనంచేస్తారు. అబ్బ! వెధవవాగుడు. వినలేంమరి—తెలీ కడుగుతాను. యిలా యెంతకాలంచెప్పండి? యెవ్వడూ మీ తమ్ముళ్లకు తినిపించుతూకూర్చుంటే పిల్లసంగ తేమౌతుందో చూశారా? దానికోసం కాస్తయినా సిద్ధ చెయ్యకపోతే అప్పుడీ తమ్ముళ్లు మీకు సహాయం చేస్తారనుకుంటున్నారా?

"ఎందుకుచెయ్యరు సరూ? సహాయంచేస్తారు. వాళ్ళ అదృష్టం బావుండి కాస్త మంచిఉద్యోగం దొరికిందంటే అప్పుడు మనకు వాళ్ళు తోడుపడరూ?"

"మీ రలాగే అనుకుంటున్నారు గామోసు—ఇది కలికాలమండీ; కలికాలం—ఎవరికివారే యమునా తీరే... ఒకరి కొక రెవరూ కారు. చూస్తాంగా; మీ అన్నయ్య యేం తెలివితక్కువవా రనుకుంటున్నారా? నాలుగు పైసాలు వెనకవేసుకుందుకు యీ యెత్తుయెత్తారు. మీ కామాత్రం చాకచక్యం లేకపోయింది."

"పోనీ లేవే; డబ్బుతో ఏముంది? డబ్బును మనం గడిస్తున్నాంగాని అది మనల్ని గడించటంలేదుగా."

"ఆ, యిలాంటి కబుర్లుచెప్పమంటే తొణుకూ బెణుకూ లేకుండా చెప్తారు."

"మనంమాత్రం యిక గడించలేకపోతామూ? ఇదిగో—యీ పదిహేను రోజులలో పీ ళ్ళిద్దరికి కార్ఖానాలో ఉద్యోగం దొరుకుతుంది. దాని కన్నిప్రయత్నాలూ పూర్తయ్యాయి. భగవంతుని కృపవల్ల అది సఫలమయిందా, మనవంట పండిందనుకో. యిన్నాళ్ళూ వాళ్ళకోసం పడ్డకష్టాలొక్కసారిగాతీరిపోతాయి."

"ఓహో! అదా మీ అభిప్రాయం! ఎంతో అనుభవజ్ఞుల్లా ముందు ప్లాను వేశావు—ఇంతా వుద్యోగం దొరికిన తరువాత మీకు పంగనామాలు పెడితేనో!"

"అహా యెప్పటికీజరగదు సుమా. ఆమాత్రం వాళ్ళకు విశ్వాసం వుండకపోదు. ఎప్పుడో గతించిన మా నాన్నను జ్ఞాపకంచేసుకుంటూ మా అమ్మ మూడు సంవత్సరాలకిత్రం పరలోకప్రాప్తి అయిందని నీకు తెలుసుగదూ: అప్పట్నుంచీ వీళ్ళు నా దగ్గరే వుంటున్నారు నువ్వు వచ్చి యేణ్ణర్ధం అవుతుంది గాని అంతకుముందు వీళ్లు నాకు భోజనం వండే వాళ్ళంటే నమ్ము. అలాంటివాళ్లు నన్ను మర్చిపోతారంటావా?"

"లేదు—మర్చిపోరు. మేలుమరవకుండా మెడలో పూలహారంవేసి వూరేగిస్తారు. విశ్వాసపాత్రులన్న బిరుదు పొందుతారులెండి. అయినా నా కెందుకీ అనవసరపు రభస... మీలో మీకెలాఉంటే నేం?" అంటూ భోజనంచేసేందుకు వంట గదిలోకిపోయింది. జోగారావుకేం తోచక ఆడకత్తెరమధ్య పోకచెక్కలా యిరుక్కుపోయి తికమక పడుతూ మళ్ళీ ఆఫీసుకు బయలుదేరాడు.

## 3

"నువ్వు చాల తొందరపడ్డావురా హరీ!" అన్నాడు వేణు షాపునుండి తిరిగి యింటికి వస్తూ.

"ఏ విషయంలో...?" అర్థం కానట్టుగా ప్రశ్నించాడు హరి.

"ఇంకేం విషయం... ఇవ్వాళ మధ్యాహ్నం వదినతో మజ్జిగ విషయంలో వాదన

"అయితే, నాదే తప్పంటావ్?" కోపంగా చూశాడు హరి.

"తప్పు నీది కాదనుకో, ఎందుకలా అనటం చెప్పు? అన్నయ్య మనవాడయినా వదిన పరాయిదిగా, అందుకే మనం ఆలోచించుకుని మాట్లాడాలి."

"నీకేమోగాని, నాకా యింట్లో వుండటం యేం నచ్చలేదు."

"నాకుమాత్రం యిష్టమనుకున్నావా హరీ! కాని ఎక్కడికి పోతాం చెప్పు? పెద్దన్నయ్యాంటే, అసలాయింట్లోనే అడుగుపెట్టలేమాయె. తప్పితే సత్రం మాత్రం కన్పిస్తుంది. సత్రంలోవుంటే మనకొచ్చిన జీతమంతా భోజనానికే ధారపోయాలి. ఈమధ్యనే మనకోసం కార్ఖానాలో వుద్యోగంకోసం ప్రయత్నిస్తున్నాడట అన్నయ్య. అది ఫలించిందా అప్పుడు మన త్రోవ మనం చూసుకుందాం" అన్నాడు వేణు.

"అయితే వుద్యోగంఅయింతరువాత మనం అక్కడి నుండి పోదామంటావా?"

"మరే మనుకుంటున్నావు! ఎంతకాలమని వదిన అదుపాజ్ఞల్లో వుంటాం?"

ఈ సంభాషణలో యిల్లుసమీపానికి వచ్చారు.

రోజులు గడుస్తున్నయ్. జోగారావు అన్నదమ్ముల వుద్యోగం విషయంలో భగీరథప్రయత్నాలుచేసి కొంత ధన వ్యయంతో చివరికి సఫలీకృతుడయ్యాడు. అనుకున్నట్లుగా

పదిహేనురోజులకే హరి వేణులు కర్మాగారంలో వుద్యోగస్తులయ్యారు. జోగారావు అమితానందం పొందాడు. ఇక తన భవిష్యత్తు కొంత బావుంటుందనుకున్నాడు.

వేణు,హరి, యిరువురు తప్పు అభిప్రాయాన్ని మనసులో వుంచుకుని స్వార్థపరత్వంతో సంతసించారు. సరోజిని మాత్రం సంతసించలేకపోయింది. తమ్ముల వుద్యోగంకోసం కొంత డబ్బు అప్పుచేసినందుకు భర్తను నాలుగు చీవాట్లుపెట్టింది.

"మీకేం పోయింది! తమ్ముళ్ళకోసమని అప్పుచేశారు. అదెలా తీరుస్తారు?" అంది సరోజిని ముఖం చిట్లించుకుని.

"ఎందుకు తీర్చలేం సరూ! వాళ్ళు యీ నెలనుండి నూరుకుపైగా యిద్దరూ తెస్తారు. అందులో డబ్బే కొంత వెనకేసి ఒక్కసారిగా తీర్చేయవచ్చు."

"మీరింకా గాలిలో మేడలు కడుతున్నారు. అవి వొక్కసారిగా కూలిపోతాయని తెలీదు—అలా ఆ విషయమే ఆలోచించుకొని కూర్చోండి. తెచ్చిన జీతమంతా చేతిలో పెడతారు" అంది వ్యంగ్యంగా.

భార్య మాటలు యెప్పుడూ యిదే ధోరణిలో వుండటం జోగారావుకు కొత్తకాదు. అందుకే తానున్న దేదో కాకమానదని వూరుకున్నాడు.

# 4

రోజుకురోజు హరి, వేణుల చర్యలు విచిత్రంగా కన్పిస్తున్నయ్. అప్పుడప్పుడు వాళ్ళ నవ్వులు, కేరింతలూ, ఎగతాళి చేస్తున్నట్టుగా అనిపించేవి సరోజినికి. అయినా పల్లెత్తు

మాటనేదికాదు భర్తకు భయపడి; అథవా యేం చెప్పినా జోగారావు భార్యమాటలు పెడచెవిని బెట్టేవాడు జోగారావు అనుకుంటూ ఉండేవాడు, తన తమ్ముల సహాయంవల్ల భవిష్యత్తులో తను కొంత సాధించగలనని—

జోగారావుఅన్నయ్య మూర్తి, తమ్ముల ఉద్యోగం సంగతి విన్నాడు. ఇప్పు డతనికి వారిపై అభిమానం ముంచు కొచ్చింది. వారిపై అభిమానమనుకుంటారేమో! కాదు—వారు తెచ్చే డబ్బుపై గల అభిమానం.

ఓరోజు మూర్తి యింటికి పోతూవుంటే తోవలో వేణు, హరి కలిశారు. ఓ చిన్ననవ్వు నవ్వుకుంటూ యిద్దర్నీ దగ్గరికి పిల్చాడు.

"వేణూ! ఎప్పుడూ జోగారావన్నయ్యదగ్గరే వుంటే యెలారా? నేను మాత్రం మీ తోబుట్టువును కాదూ! నాకూ అభిమానాలు, ప్రేమలూ ఉన్నాయి. ఇంట్లో యెవ్వరూ లేక పోవటం దిగులుగా వుంటోంది. మీ వదినకూడా మిమ్మల్ని రమ్మంది. యిద్దరూ వచ్చేయకూడదూ?" అన్నాడు యెంతో అభిమానమున్నవాడిలా మూర్తి.

వేణు ఆశ్చర్యపోయాడు. హరివంక చూచాడు. హరి తనయిష్టతను చిరునవ్వుతో కనబర్చాడు చూపుల్లోనే సంజ్ఞలు చేసుకున్నా రిద్దరన్నదమ్ములు.

"సరే నన్నయ్యా! వీలు చూచుకుని వచ్చేస్తాం" అన్నాడు హరి.

"అలా కాదురా! మీ రలా సమిష్టిభావంతో రావటం అసంభవం. జోగారావు మిమ్మల్ని విడిచిపెట్టడు. మీరు

తెచ్చే డబ్బంతా దోచుకోవాలని వాంఛిస్తున్నాడు. అందుకే య్మేదైనా విరోధం తెచ్చుకుని యిల్లు దాటడం మంచిది" అని హితోపదేశం చేశాడు మూర్తి, శ్రేయోభిలాషిలా.

"నేనూ అదే అనుకుంటున్నా అన్నయ్యా - యేంరా హరీ! నీతో మొదటే చెప్పలేదూ?—అలాగే ప్రయత్నిస్తా నన్నయ్యా..." అంటూ వేణు ముందు దోవతీశాడు. హరి అతన్ని వెంబడించాడు. మూర్తి తనపాచిక పారినందుకు సంతోషిస్తూ ముందడుగు వేశాడు.

రెండురోజులు గడిచినయ్. కాని యెవరితోనూ, యేవిధమైన విరోధం తెచ్చుకోటానికి అవకాశం లేకపోయింది—ఎలా వుంటుంది? వదినె అసలు మాట్లాడేదికాదు జోగారావును యెదిరించి, కోరి కయ్యం యెలా తెచ్చుకుంటారు? అందుకే...

ఓరోజు సాయంకాలం జోగారావు యింట్లో వున్నప్పుడు యిద్దరన్నదమ్ములు బట్టలపెట్టెలు సర్దుకోవటం మొదలుపెట్టారు. జోగారావు యిదంతాచూచి అకస్మాత్తుగా ఎక్కడికి ప్రయాణం కడుతున్నారో అర్థంకాక విస్తుపోయాడు.

"ఏరా వేణూ! ఎక్కడికీ ప్రయాణం!" వుండలేక అనేశాడు జోగారావు. సరోజిని ద్వారందగ్గర నిల్చుని చూస్తోందంతా.

వెంటనే జవాబు చెప్పేందుకు ధైర్యంచాలక వేణు కొంతసేపటివరకు తికమకపడ్డాడు. హరి జంకూ గొంకూ లేకుండా—

"మాకీయింట్లో కాస్తయినా మర్యాద లే దన్నయ్యా! వదిన మమ్మల్ని నీచాతినీచంగా చూస్తోంది. ఎంత మేం చిన్న

వాళ్ళమయినా అభిమానమంటూ వుందిగా! ఇక మాదారి మేం చూసుకుంటాం" అనేశాడు.

జోగారావు స్తబ్ధుడైపోయాడు, నివ్వెరపోయి, నోట మాటరాలేదుకూడా. సరోజిని కోపంగా పెదవి కర్చుకుంటూ అలానే నిల్చుంది.

"ఏంరా వేణూ! నువ్వు జవాబు చెప్పవేం? నీ అభిప్రాయంకూడా అదేనా?" అన్నాడు జోగారావు మళ్లీ.

"ఔనన్నయ్యా..." మెల్లిగా అన్నాడు వేణు, మనసు లోపల సంఘానికి భయపడుతున్నట్టుగా.

ఇప్పుడు జోగారావు తనభార్య చెప్పినమాటలు అక్షరాలా నిజమౌతూండటం గమనించి తన తెలివితక్కువతనానికి తనను తిట్టుకున్నాడు.

"...మూడు సంవత్సరాలు మిమ్మల్ని నాదగ్గరుంచి పెంచాను. నేనెన్ని కష్టాలు పడినా, మీకుమాత్రం కష్టం కలిగించలేదు. చివరికి కొంతడబ్బు అప్పుచేసి యిద్దరికీ వుద్యోగాలు వేయించా—చివరికి యిదా ప్రతిఫలం...?" అన్నాడు జోగారావు పాపం బాధపడుతున్నట్టుగా.

"మా కాళ్ళ ఆడినంతవరకూ, కూటికోసం యెన్ని బాధలైనా అనుభవించాం అన్నయ్యా! మీరు నిజంగా మాకేం కష్టంకలిగించలేదు. అదెప్పటికీ మర్చిపోం—కాని వదిన దగ్గరమాత్రం ఒక్కఘడియ ఉండలేం. ఇప్పుడు మా కాళ్ళపై మేం నిల్చున్నాం. మాదారి మేం చూచుకుంటాం భవిష్యత్తు కోసం" అన్నాడు వేణు. జోగారావు పూర్తిగా అర్థం చేసు

కౌగలిగాడు. ఇంక శాంతం వహించలేకపోయాడు. అతని రక్తం కడువేగంగా ప్రవహిస్తోంది.

"వెళ్ళటానికి వీలులేదు వేణూ! నే నప్పుచేసి మీ ఉద్యోగాలకోసం, రెండువందల రూపాయలు లంచంపెట్టాను. అవి యిక్కడ పడేయనంతవరకు వెళ్ళనివ్వను" అన్నాడు కోపంగా జోగారావు.

ఈ వాదనలు వినిపించిన యిరుగు పొరుగువాళ్ళు ఇంటి ముందు మూగారు.

"రెండువందలు లంచమిస్తారని తెలుస్తే మొదటే మాకీ ఉద్యోగాలు వద్దని చెప్పి ఉండేవాళ్ళం. మీ భాధ్యత మీరు తీర్చుకున్నారు. దానికి మేం యేం చేస్తాం? " అన్నాడు వేణు. అతడికి తెలుసు, యిక తమ ఉద్యోగాలు స్థిరంగా ఉంటాయని.

"నిజమే! వాళ్ళేంచేస్తారు? మీ తెలివితక్కువతనానికి ఫలితం మీరే అనుభవించండి" అంది కోపంగా సరోజిని. వేణు, హరి ఒకేసారి ఆమెవేపు చూచారు. మరేం అనకుండా చెరొక పెట్టె చేతిలో పట్టుకున్నారు.

"వెళ్ళొస్తాం అన్నయ్యా! వెళ్ళొస్తాం వదినా" అంటూ యిరువురు మూగిన జనాన్ని చీల్చుకుని దాటిపోయారు. అక్కడున్న జనం తలోమాటా అన్నారు.

"విశ్వాసఘాతుకులు......" అంటూ రెండుచేతులతో తలపట్టుకుని కూర్చుండిపోయాడు జోగారావు.

# తెరవని తలుపులు

సోమేశ్వరరావు అప్పుడే వీధిలోనుండి వస్తూ సగం కాల్చిన సిగరెట్టును పారేసి వరండాలో కుర్చీలో కూర్చున్నాడు వుస్సురనుకుంటూ. భర్తరావటం చూసిన సరళ కాఫీ పట్టుకొచ్చింది. "మీ తమ్ముడేడీ...?" అన్నాడు సోమేశ్వరావు కాఫీ అందుకుంటూ.

"అలా తిరిగి వస్తానన్నాడండీ, వాడికి యింట్లో వూరకనేకూర్చోవటం విసుగ్గానేవుంది" అంది సరళ యెదుటకుర్చీలో కూలబడుతూ "సినిమాకి వెళ్ళివుంటాడు గామోను... వూరకనే కూర్చున్నవాళ్ళ కిదో గొప్ప దుర్వలవాటు."

"లేదండీ...యిప్పుడే వచ్చేస్తానని చెప్పాడుకూడా."

"ఆ! కృష్ణాటాకీస్ యజమానితో మాట్లాడాను. మా నాన్నగారికి మంచి స్నేహితు డతను...ఏదేనా వుద్యోగం చూడమన్నాను. వాళ్ళ టాకీసులో మేనేజరు అవసరముందట. కావాలంటే మనవాడి కా ఛాన్సు యిస్తానన్నాడు."

"చచ్చాం...వాడి కిల్లాంటి వుద్యోగాలంటేనే రోతని తెలిసీ యెలా యీ ప్రయత్నం చేశారండీ!"

తెలుసు. నిజమే! అవుతే యెన్నాళ్ళు యిలా నిరుద్యోగిగా కూర్చుంటాడు! ప్రస్తుతం అదైనా లభిస్తుందని సంతోషిస్తే బావుంటుంది" అన్నాడు సోమేశ్వరావు, కాఫీకప్పును ఖాళీచేసి క్రింద వుంచేస్తూ.

"నాకేం తెలీదు బాబూ! వాడినే అడగండి. అదిగో–వాడూ తిరిగివచ్చేస్తున్నట్లున్నాడు" అంది సరళ.

వెంకటేశం వస్తూ ఓనిట్టూర్పువిడిచి దూరంగా వున్న కుర్చీని దగ్గరగా లాక్కొని కూర్చున్నాడు.

"ఏమోయ్, అలా తిరిగి వస్తానని చెప్పి పోయావటగా ...అప్పుడే వచ్చేశావేం?" అన్నాడు సోమేశ్వరరావు.

ఎక్కడికిపోయినా ఒకలాగేవుంది బావా! అసలు యీ వూళ్ళోవున్న ప్రజలు యెలా కాలం గడుపుతున్నారో అర్థం కాకుండా వుంది... ఓ పార్కంటే లేదు...యిక రీడింగ్ రూం వున్నా, లేనట్టే జను...యింతవూరుంది, ఓ పార్కు మంచిది యేర్పాటు చేయలేకపోయారు" అన్నాడు వెంకటేశం నవ్వుతూ.

"మరి యిన్నాళ్ళూ నువ్వెలా కాలం గడుపుతున్నావ్" అన్నాడు సోమేశ్వర్రావు నవ్వుతూ.

"అదీ నా కర్థం కాలేదులే" అన్నాడు వెంకటేశం చిలిపిగా నవ్వి.

"పోనీగాని, యెన్నాళ్ళని యిలా ఉద్యోగంలేకుండా వుంటావ్? వూరకనే కూర్చుంటే సోమరితనం మరీ హెచ్చయిపోతుంది."

"ఔను బావా, నిజమే! కాని వూరకే కూర్చోక యేం చేయను? ఉద్యోగం దొరకాలా?"

"కృష్ణాటాకీస్‌లో 'మేనేజరు అవసరం వుందట..." అని యింకా సోమేశ్వర్రావు ఏదో చెప్పబోతూవుంటే వెంకటేశం చప్పున అందుకొని.

"అల్లాంటి ఉద్యోగం చేస్తాం బావా! తెలీనట్టు నువ్వూ చెప్తావేం? బి. ఏ. చదువుకున్నది యీ వుద్యోగం వెలగబెట్ట

డాసకేనా? అన్నాడు సోమేశ్వరరావు ఆలోచనలోపడ్డాడు. నిజమే! బి. ఏ. చదువుకున్న దెందుకా అని తనలోతాను ప్రశ్న వేసుకున్నాడు.

"మరేంచేస్తాం... ఏం తోచకండా వుందోయ్... భగీరథప్రయత్నాలుచేసినా వుద్యోగాలు కలలోమాటయి పోయాయ్...నాపరిస్థితీ యిలాగే వుండేదిలే—ఓ సంవత్సరం పూర్తిగా కాలాన్ని వ్యర్థంచేశాక యీ గుమాస్తాగిరి దొరికింది. ఆ! అన్నట్టు మొన్నను యింటర్వ్యూకి వెళ్ళావుకదూ! ఏమయిందీ?"

"యింకేంలేదు తెలీదు బావా! రెండుమూడుదినాల్లో తెలియాలి. నాకు నమ్మకముంది తప్పక ఛాన్సు దొరుకుతుందని."

"ఇంతాచూస్తే బ్యాంకులోగుమాస్తాగిరేగా."

"ఏదోఒకటి బావా...ఏంచేస్తాం? యీరోజుల్లో చదువుకి విలువ లేకపోతోంది" అన్నాడు వెంకటేశం.

"నేను చెప్పానుగదండీ, వాడి కిష్టముండదని" అంది సరళ

"సరేలే... ఆఁ, యెవరా వస్తోందీ?"అంటూ ద్వారం వేపు చూశాడు సోమేశ్వరరావు.

"కమలేండి... రావే కమలా" అంటూ ఆహ్వానించింది సరళ.

"యేం చెల్లీ! యివాళంతా అగుపించనేలేదు...?" అన్నాడు సోమేశ్వరరావు

"తీరిక లేదన్నయ్యా!" అంది కమల.

"లేదు...నువ్వుచేసేపనులే అన్నీను, అందుకే తీరిక

లేదు" అన్నాడు వెంకటేశం చిలిపిగా కమలవేపు చూస్తూ.

"చూడన్నయ్యా! యెప్పుడూ ఇంతే బావ" అంది కమల బుంగమూతి పెడుతూ.

"లేదులేవే...బావవుతాడు కదూ, అందుకే పరిహాసం" అన్నాడు నవ్వుతూ సోమేశ్వర్రావు.

"అమ్మేంచేస్తూందే...?" అన్నాడు సోమేశ్వర్రావు.

"ఏం లేదన్నయ్యా, వంటయిపోయింది... యింట్లో మరేం వ్రుబునుపోలేదు. యిలా వచ్చేశాను" అంది కమల.

"కూర్చోవే కమలా- నిల్చుండిపోయావేం!" అంది సరళ.

"మరి కూర్చోను ఒదినా! చీకటిపడిపోతుంది. పోవాలి. అమ్మ కోప్పడుతుంది" అంది కమల.

"అవుతే నిల్చుని వెళ్ళిపోవటానికేనా వచ్చావ్?" అన్నాడు వెంకటేశం నవ్వుతూ.

"చాల్లే! నువ్వూరుకుందూ!" అంది వెక్కిరిస్తున్నట్టు కమల.

"ఔను చెల్లీ! బావ అన్నట్టు నిల్చునిపోవటానికే వచ్చావా?" అన్నాడు సోమేశ్వరరావు. వెంకటేశాన్ని అన్నయ్య సమర్థించినందుకు కమల చిన్నపోయింది.

"యీ రోజంతా రాలేదని వచ్చా నన్నయ్యా, వస్తాను మరి... వస్తా ఒదినా" అంటూ బయలుదేరింది కమల.

"నాకు చెప్పనవసరం లేదులే...నేనూ అలా వస్తాను పద" అంటూ కమలవెనువెనకనే బయలుదేరాడు వెంకటేశం. సోమేశ్వర్రావు సంతృప్తిగా నవ్వుతూ.

"చూచావా సరళా! వాళ్ళిద్దరి అన్యోన్యం...మన పాత జ్ఞాపకాలు మెదులుతున్నయ్ కదూ!" అన్నాడు.

"చాల్లెండి పిచ్చి...యిప్పటికి మాత్రం మానా లేమిటి? కొత్తస్మృతులనుకో కూడదూ?" అంది సరళ.

"కమల నీలా మాంచి చురుకైన పిల్ల కదూ!"

"నామాటకేంగాని, కమలమాత్రం చురుకైనదే"

"కమలనుచూస్తే నాకు ముచ్చటేస్తుంది సరళా! నాకు అక్క చెల్లెళ్లు లేని లోటు తీరిపోతూంది. ...అదేవిటో రోజు కొక్కసారైనా దాన్ని చూస్తేనేగాని మనసొప్పదు"

"ఆ వాత్సల్యం అల్లాంటిది లెండి"

"మీ తమ్ముడికి పెళ్ళయ్యాక వాళ్ళిద్దర్నీ మనింట్లోనే వుంచేస్తాను."

"గాలిలో మేడను కట్టకండి—సాధారణంగా అవి కూలి పోతూవుంటయ్. ముందాలోచ నెందుకూ? మొదట వాళ్ళి ద్దరికి పెళ్ళి జరగనిద్దురూ. ఏమో...వీడికింకా వుద్యోగం లేదు" అంది సరళ.

"ఫరవాలేదులే...ఉద్యోగం యెల్లకాలందొరక్కుండా వుంటుందా? ఇంటర్వ్యూకి వెళ్ళనే వెళ్ళాడు...నాకేం భయం లేదు....గాలిమేడలు కూలిపోతాయన్న నిరాశా లేదు. మా పిన్నితో చెప్పి ఒప్పిస్తాను. నా ఆసరా చూచుకునైనా పిన్ని ధైర్యంగా ఒప్పుకుంటుంది."

"ఏమో! తరువాత అవన్నీ మాట్లాడుకోవచ్చు... లేచి బట్టలైనా మార్చండి భోంచేద్దురుగాని" అంటూ వెళ్ళిపోయింది సరళ లోపలికి. సోమేశ్వరరావు తన గదిలోకిపోయాడు.

సోమేశ్వరరావు తలిదండ్రులికి ఒకే ఒక్క కొడుకు. అతని చిన్నతనంలోనే తండ్రి పోయాడు. మేనమామల దగ్గర పెరిగి వుద్యోగస్థుడైన మరుసటి సంవత్సరమే కొడుకు వివాహం కళ్ళారాచూడని తల్లి మరణించింది. సరళకూడా దూరపుబంధువు కాదు. కాస్త సన్నిహితసంబంధం వుంది. సరళకికూడా తండ్రిలేడు. తల్లి, తమ్ముడు వున్నారు. తల్లి మాత్రం మేనమామ యింట్లోనే వుంటూం దెప్పుడూ. వెంకటేశం బి. ఏ. చదివి బావగారింట్లోనే వుంటున్నాడు ఉద్యోగంకోసం యెదురుచూస్తూ.

సోమేశ్వరావు పినతల్లి పద్మావతి. ఆమెకూతురే కమల. సోమేశ్వరరావు యింటికి పదడుగుల దూరంలో వుంటుంది వాళ్ళిల్లు. కమలతండ్రి క్రిందటేడాదే పరలోకం చేరుకున్నాడు—కష్టార్జితంగా గడించిన ఆస్తి విడిచి. అందుకే కమల కేలోటుపాట్లు లేకుండా అతిగారాబంగా పెంచుతూంది పద్మావతి. కమల థర్డుఫారంవరకు చదివి యుక్తవయసు రాగానే చదువుకి స్వస్తిచెప్పింది.

పోతే యిందులో లేనివాళ్ళెవ్వరూకారు. సోమేశ్వరావుకి బాగా ఆస్తివుంది. వెంకటేశంకి కొద్దో గొప్పో స్థిరాస్తులున్నయ్. రెండు పెద్ద యిళ్ళున్నయ్. సోమేశ్వరావుకి కమలంటే యెంతో అభిమానం, వాత్సల్యమూను; ఆమెను కళ్ళారాచూస్తూ, అతనికి చెల్లెళ్ళులేనిలోటు తీర్చుకుంటున్నాడు. అతని ఆశయం కమల ఎప్పుడూ తనకళ్ళెదుట మెలగుతూ వుండాలని. అందుకే వెంకటేశంకి కమలని ముడిపెడితే పరిస్థితులు సవ్యంగా, అనుకూలంగా వుంటాయనుకున్నాడు. ఆ

విషయాన్ని పద్మావతితో యింతకుముందు చెప్పాడుకూడా. పద్మావతి ఏమీ ఆటంకం చెప్పలేదు.

కమల కాస్త సన్నగా, పొడవుగా, బంగారపు ఛాయలో వుంటుంది. చూడడానికి అందంగా, ఆకర్షణీయంగా వుంటుంది...చదువంతగా లేకపోయినా సంస్కారం మాత్రం బాగా అలవడింది ...వెంకటేశం అంటే ఆమెకి ప్రాణం. కాని ఆ అభిప్రాయం ఎవ్వరికీ తెలియనివ్వకుండా ప్రవర్తిస్తుంది.

వెంకటేశం అంత అందగాడు కాకపోయినా, కురూపి మాత్రం కాడు. చదువుకితగ్గ ఉత్సాహం ఉంది. ఎల్లప్పుడూ చిరునవ్వు అతని పెదాలపై తొణికిసలాడుతుంది. కమలకి హృదయాన్ని అర్పించాడు. ఎప్పటికైనా కమలనే వివాహం చేసుకోవాలని అతని ఆశయం...కాని వుద్యోగం లేకపోవడం అతని ఆరాటాన్ని హెచ్చించింది. చిన్నతనమనిపించింది కూడా. సినిమాహాల్లో వుద్యోగాలు, బట్టలకొట్టులో గుమస్తా పదవులు అతని దృష్టిలో నీచంగా వుంటయ్. నిజమే! అతనికే కాదు...ఆపాటి చదువున్న ప్రతివాడికీ అలానే వుంటయ్... అతనికేం...దినం గడవకపోవటం లేదుకదా! కావల్సినంత ఆస్తివుంది...అధవా ఉద్యోగం దొరికితే ఏ గవర్నమెంటులోనో రైల్వేలోనో గుమస్తా ఉద్యోగమైనా ఫరవా లేదంటాడు. దురాశలేదు అల్ప సంతుష్టి.

సీతారాం పద్మావతికి దూరపు బంధువు. అత డా వూర్లో మాంచి పలుకుబడివున్న వ్యక్తి. సీతారాం కొడుకు సత్యం, అవూరు మునిసిపల్ హైస్కూల్లో వుద్యోగం చేస్తు

న్నాడు. ఆవూళ్ళోవున్న మోతుబరి రైతుల్లో సీతారాం ఒకాడు. వుదయం తొమ్మిదిగంటలకు పద్మావతి యింటికి వచ్చాడు. అడుగుల ధ్వనివిని—

"ఎవరే కమలా వస్తోంది?" అడిగింది పద్మావతి కళ్ళద్దాలు సర్దుకుంటూ. కమల కాస్త ముందుకుపోయి

"సీతారాం తాతయ్యో!" అంటూ వెనక్కి వచ్చేసింది. సీతారాం ఇంట్లోకివస్తూ-

"తాతయ్యనేశావేంటే? మా నయ్యను కమలా!" అన్నాడు నవ్వుతూ.

"రా అన్నయ్యా, కూర్చో!" అంది పద్మావతి! వరుసకి అన్నయ్యఅని వాడుతూవుంటుంది పద్మావతి.

"ఏవిఁటిలా వచ్చేశారు?" మళ్ళీఅంది పద్మావతి.

"ఏఁవీలేదమ్మా! ఓసారి మిమ్మల్ని చూసిపోదామని వచ్చాను." అన్నాడు సీతారాం కమలవేపు చూస్తూ.

"అంతా క్షేమమా?"

"ఆఁ క్షేమానికేముందిలే...ఎప్పుడూ యేదో ఒహా కష్టం వుండనే వుంటుంది. అందులోనూ మీా వదిన మరీ నీరసించిపోతూ యింటిపనులు చక్కబెట్టుకోలేక సతమతమౌతుంది."

"ఔనుమరి...వయసు ముదిరిపోతోంది...నేనూ అంతే నన్నయ్యా! యిప్పు డేపనీ చెయ్యలేను. శక్తివుండొద్దూ...? ఏం, మరి అబ్బాయికి పెళ్ళిచేయకూడదూ? ఆ వచ్చినమ్మాయే చూసుకుంటుంది" అంది పద్మావతి. ఆడబోయిన తీర్థం యెదురె నటుగా బోసినోరువిప్పి నవ్వుతూఅన్నాడు సీతారాం

"రెండు మూడు సంబంధాలొస్తున్నాయ్...కాని వాళ్ళ అమ్మకిష్టంలేదు. వున్నవూర్లోనే ఏదో సంబంధం చూడమని ప్రాణాలు తీసేస్తోంది."

"వూరుకున్నారేం...? చూడండన్నయ్యా! ఈరోజుల్లో ఆడపిల్లలకేంలోటు?"

"అలా అనేశావుగాని, 'పోనీ కమలని చేసుకోకూడదా?' అన్నావుకాదు. అంతలోవుంది బంధుత్వం..." అన్నాడు సీతారాం కమలవేపుచూసి నవ్వుతూ. కమల గుండెల్లో రాయిపడింది. పద్మావతికూడా నవ్వేసింది.

"మా కమలని మీయబ్బాయెక్కడ చేసుకుంటాడులే అన్నయ్యా! అతనికేం! ఎంతోమంది పిల్లనిస్తామంటారు" అంది.

"ఒక్కసారి అలాఅనేసి తప్పించుకోవాలని చూస్తున్నావా? కమలని భార్యగా పొందడానికి మా అబ్బాయి తగడన్నమాట.?"

"అలాగని నే ననలేదన్నయ్యా."

"మరవుతే, కమలనే కోడలుగా చేసుకుంటాను."

"ఊరుకో అన్నయ్యా, వేళాకోళం ఎందుకూ?"

"వేళాకోళం కాదు, నిజంగానే! అసలు యిప్పుడు రావటంకూడా అందుకే" అన్నాడు సీతారాం...అక్కడే నిల్చున్న కమల శరీరమంతా చెమటపోసింది.

సీతారాంమాటలు విన్న పద్మావతి ఉబ్బిపోయింది. ఆవూళ్ళో కాస్తో కూస్తో పలుకుబడి, ధనంవున్న సీతారాం తనకు వియ్యంకుడవుతూంటే యింకేం కావాలి?

"కమలా! నువ్వుపోయి కాస్త కాఫీ తయారుచేసి

వ(ట్టామ్మా” అంటూ కూతురువేపు తిరిగింది. ఆమె అభిప్రాయం కాఫీ తయారుచేయించాలనికాదు. కమలని అక్కడ నుండి వెళ్ళగొట్టాలని; కమల తల్లికి అడ్డు చెప్పకుండా కష్టంగా అక్కడినుండి కదిలింది.

“ఏమిటన్నయ్యా, నిజంగానా?” అంది పద్మావతి మెల్లగా నవ్వుతూ.

“ఔనమ్మా! మావాడు సత్యం ఒకటే పట్టుపట్టాడు. కమల గాక మరెవ్వరూ వాడికొద్దంట... ఇక మీావదినె మాట సరేసరి... కమలంటే వంచప్రాణా లావిడికి... ఆమె ప్రోద్బలం మీాదే యిప్పు డొచ్చాను” అన్నాడు సీతారాం.

“నేనుమాత్రం కాదంటానా అన్నయ్యా! నాకూ తొందరగానే వుంది అమ్మాయి పెళ్ళినిగురించి. కాటికికాళ్ళు చాచుకునివున్న నే నెప్పుడు గుటుక్కుమంటానో యెవరికి తెలుసు?”

“అదేంమాటగానీ, నీకిష్టమయినట్టే నన్నమాట... బ్రతికాం... లేకపోతే మీా వదినెబాధ పడలేను...మరి కమల నడగొద్దూ! యీరోజుల్లో ఇష్టంలేనిపెళ్ళి చెయ్యటం మంచిదికాదు.”

“దాన్నడగటం యెందుకులే అన్నయ్యా! నే నన్నమాట కది యెదురుచెప్పదు.”

“మరవుతే బ్రాహ్మణ్ణి పిలిపించమంటావా?”

“అలాగే కానీండి...”

“మరి లాంఛనాలు?” అన్నాడు సీతారాం బోసినోరు విప్పుతూ. అతని కావాలిసిందంతా కట్నాలూ, కానుక

లూను. మాంచి దూరాలోచన గలవాడు. పద్మావతి తదనంతరం ఆమె ఆస్తంతా కమలకే దక్కుతుందన్న ఆశ సీతారాంది.

"దానికేముం దన్నయ్యా! నా సంతోషంకొద్దీ నేనిస్తాను. ఇం కెవరున్నారని... అదొకర్తేగా" అంది పద్మావతి.

"మరి నేనొస్తాను" అంటూ లేవబోయాడు సీతారాం.

"వుండన్నయ్యా! కాఫీ తెస్తుంది...ఏమేవ్ కమలా... యింకా అవ్వలేదా?" అంటూ కేకేసింది. కమల కాఫీ పట్టుకొచ్చింది. ఆమెముఖంలో ముందున్న కళ మాయమవ్వటం సీతారాం కనిపెట్టాడు. కారణం అతనికి తెలీదు. కాని వీళ్ళ సంభాషణవింటూ కమల తెగ యేడ్చింది. ఆమెలో వున్న లోపమంతా తల్లిని యెదిరించలేకపోవటమే.

"ఏం అమ్మాయ్ అలా వున్నావ్?" అన్నాడు సీతారాం కాఫీ అందుకుంటూ కమలమొహంలోకి చూసి... పద్మావతి అందుకుంది. ఆమెకి తెలుసు కమల ముఖం యెందుకు కళావిహీనమయ్యిందో!

"ఏం లేదులే అన్నయ్యా! కాస్సేపు పొయ్యి దగ్గర కూర్చున్నదంటే అలాగే వుంటుంది" అంది పద్మావతి సమర్థిస్తూ. నిజమే అయివుండొచ్చుకున్నాడు సీతారాం...కాఫీ త్రాగి లేచి వెళ్ళిపోయాడు.

పద్మావతికి యిప్పు డెంతో ఆనందంగా వుంది. యీ రోజువరకూ కమలని వెంకటేశంకి యిచ్చి పెళ్ళి చెయ్యాలన్న అభిప్రాయంతోనే వుంది. సహజంగా తనకా అభిప్రాయం లేకపోయినా సోమేశ్వర్రావుకోసమైనా అలా చేయాలనుకుంది. లేకపోతే సోమేశ్వర్రావు విరోధవుతాడని ఆమెకి తెలుసు.

ఆమె యెదురుచూస్తున్నదంతా వెంకటేశం వుద్యోగం కోసమే.

కాని పరిస్థితులు అనుకోకుండా పరిణమించాయి. పద్మావతి దృష్టిలో కమల అదృష్టం బావుంది. సీతారాం కోడలవ్వటం సామాన్యం కాదు...ఆవూర్లో సీతారాం కున్నంతస్థితి యే కొద్దిమందికో వుంది. సీతారాం కొడుకు సత్యం బి. ఏ. చదువుకున్నాడు. హైస్కూలులో వుద్యోగం. అంతకంటె యింకేంకావాలి? అనుకుంది పద్మావతి. అప్పుడు ఆమె దృష్టిలోకి వెంకటేశంరాలేదు...సోమేశ్వర్రావుకి ఆమె భయపడలేదు. కార్యసిద్ధి కావాలంటే యెదిరించాలనుకుంది. ...ఆమె వుత్సాహంగానే వుంది. కాని కమల హృదయంలో మాత్రం తుఫాను చెలరేగింది.

వెంకటేశం అప్పుడే పద్మావతి యింటికి ఏదో పుస్తకం పట్టుకునివచ్చాడు. పద్మావతి అతణ్ణి చూచి కాస్త మండిపడింది మనస్సులో. కాని ప్రత్యక్షంగా యెలా సిరసిస్తుంది?

'రా, వెంకటేశం! కూర్చో...' అంది మెల్లగా. అలా అనక తప్పదు.

"కమల ఏదీ?" అన్నాడు కూర్చుంటూ వెంకటేశం.

"వంటగదిలో వుంది...ఏం, పనుందా?" కాస్త కటువుగానే వున్నయ్ మాటలు.

"ఏమీలేదు. అక్క యీపుస్తకం యిమ్మంది." అని అంటూండగానే కమల వంటగదినుంచివచ్చింది. వెంకటేశాన్ని చూచి గతుక్కుమంది. ఆమె పాదాలు ముందుకు సాగాయి కావు. కానీ బలవంతంమీద ముందుకి నడిచింది.

"ఇదుగో కమలా! పుస్తకం అడిగావంటగా, అక్క

పంపించింది." అంటూ ఆపుస్తకాన్ని ప్రక్కనేవున్న టేబులు మీద వుంచాడు. కమల మెల్లగావచ్చి ఆ పుస్తకాన్ని తిరగేసింది. ఆమె ముఖంలో ముందుండే ఆనందం లేక పడం వెంకటేశానికి వెర్రెత్తించింది.

"కమల అలా వుందేం అత్తా!" అన్నాడు వెంకటేశం. పద్మావతి కీ ప్రశ్న అంతగా నచ్చలేదు. ఎంతో అయినవాడిలా ఎందుకిలా ప్రశ్నించాడా అని ముఖం చిట్లించుకుంది.

"ఏం లేదులే నాయనా! పొయ్యిదగ్గరుంటే అలాగే వుంటుంది దాని మొఖం"అంది లోపల క్రోధంవున్నా బయటికి మెల్లగా చెప్తూ. కమల అక్కడినుండి లోపలికి పోయింది. వెంకటేశానికి కమల ప్రవర్త నేమీ అర్థంకాలేదు...

"వస్తా నత్తా..." అంటూ లేచాడు.

"వెళ్ళిపోదువుగానిలే...కూర్చో... ఆ! మరి నీ వుద్యోగం యేమయినట్టు?" అంది పద్మావతి యెంతో అభిమానముున్నదానిలా.

"దరఖాస్తులు పంపిస్తూనే వున్నాను. ఒక్కదానికీ జవాబు రాకుండావుంది. మొన్నను యింటర్వ్యూకికూడా వెళ్ళాను. రెండుమూడు రోజుల్లో ఫలితాలు తెలియాలి మరి" అన్నాడు వెంకటేశం.

"తప్పకుండా వుద్యోగం దొరుకుతుందన్న ఆశ వుందా?"

"వుం దత్తా!వచ్చినవాళ్ళందరికంటె నేనే బాగా అన్సరు చేశాను."

"ఎప్పుడో అది దొరుకుతుందని కూర్చుంటే యెట్లా మద్రాసుపోయి ప్రయత్నించకూడదూ? నీతో చదువుకున్న

ఆ సత్యం చూడు, యెల్లాంటి వుద్యోగంలో వున్నాడో!" అంది పద్మావతి-సత్యంముందు వెంకటేశం యేమీ కానట్టుగా.

"మద్రాసులో వాళ్ళకేవరో తెలిసినవాళ్ళున్నారు అత్తా...అక్కడ ప్రయత్నించారుట"

"ఏదో మన మలా సమాధానపడకపోతే యెట్లామరి... పోనీ ఆ ప్రయత్నం నువ్వుకూడా మద్రాసుపోయి చేసుకూడదూ? దేవుడిమీద భారంపెట్టి యెన్నాళ్ళిక్కడకూర్చున్నా వుద్యోగం దొరికినట్టే... మద్రాసుపోతే అదికాకపోతే మరో వుద్యోగమవుతుంది. అక్కడ మీ మేనమామ వున్నాడు కూడాను" అంది పద్మావతి. ఆమె సలహాలో కావల్సినంత స్వార్థంవుంది. సత్యంతో కమలపెళ్ళి జరగాలంటే వెంకటేశం కమలకి దూరంగా వుంటేనే మంచిదనుకుంది పద్మావతి.

"సరే...వస్తానత్తా!" అంటూ వెళ్ళిపోయాడు వెంకటేశం. వెళ్ళిపోయేటప్పుడు కమల కన్పించకపోవటం కాస్త బాధకలిగించింది. పద్మావతిమాటలు వెంకటేశం హృదయంలో తుపాను రేపింది. పద్మావతిదృష్టిలో తను సత్యంకంటె తక్కువై పోయాడు. నిజమే—ఉద్యోగం లేదుగా! ఉద్యోగంలేనివాళ్ళ పరిస్థితి ఎలావుంటుందో తను యిన్ని దినాలనుండి అనుభవిస్తూనే ఉన్నాడు. ఎలాగైనా మద్రాసుపోయి ప్రయత్నం చెయ్యాలి. అతని మెదడునిండా ఉద్యోగం గురించిన ఆలోచనలే... ఆ ఆలోచనలతో ఇల్లుచేరుకున్నాడు.

"ఏరా అలావున్నావు?" అంది సరళ.

"ఏంలేదక్కా! తలనొప్పిగావుంది" అన్నాడు అసలు విషయాన్ని మరుగుపరుస్తూ. నిజానికి తలనొప్పిలేదు.

"వేడికాఫీ యిచ్చేదా?"

"వద్దక్కా...నాకేం మనసు బాగాలేదు" అలా అన కూడదనుకునే అనేశాడు.

"ఏమైందిరా...? యిప్పటికిప్పుడు మనసు బాగు లేక పోవడమేమిటి?"

"ఉద్యోగంకోసం మద్రాసు వెళ్ళాలక్కా! ...ఎలాగో ఓలాగు ఉద్యోగం సంపాదించాలి... ప్రతివాళ్ళూ 'ఉద్యోగం యింకా దొరకలేదూ?' అని అడిగేవాళ్ళే...నాకు చిన్నతనంగా వుందక్కా!"

"ఎవ్వరా ఆ అడిగేవాళ్ళు...? ఎవరికైనా యెందుకు నీ విషయం...నిన్ను వాళ్లు పోషిస్తున్నారా?" అంది సరళ ఆవేశంగా.

"ఒకరడిగినంతమాత్రాన యేం పోయింది గానీ, మన తృప్తి మనకుండొద్దూ! ఎలాగైనా మద్రాసు వెళ్ళాలక్కా" అన్నాడు వెంకటేశం.

సోమేశ్వర్రావు అప్పుడే యింట్లోకి వస్తూ "ఏమి టోయ్ వెళ్ళాలంటున్నావ్... ఎక్కడికి?" అన్నాడు కుర్చీలో కూలబడుతూ.

"మద్రాసు వెళ్తానంటున్నాడండీ" అంది సరళ.

"ఎందుకోయ్...? బావమర్దివేపుతిరిగి అన్నాడు సోమే శ్వర్రావు.

"వుద్యోగంకోసం బావా! ఎన్ని దరఖాస్తులు పంపినా లాభంలేకపోతోంది. స్వయంగావెళ్ళి యేదో ప్రయత్నం చెయ్యాలి." అన్నాడు వెంకటేశం.

"పిచ్చివాడా! స్వయంగా వెళ్తేమాత్రం సఫలమవుతుందంటావా! నీలాంటి నిరుద్యోగులు వేలకి వేలు తిరుగుతూంటా రక్కడ...ఆ అదృష్టం కలిసిరావాలంతే" అన్నాడు సోమేశ్వరరావు. కాని వెంకటేశం తన నిశ్చితాభిప్రాయాన్ని మార్చుకోలేకపోయాడు.

"పోనీ ఏం పోయింది బావా! ఓసారి వెళ్తే ఏం! యేపాటి దూరమని! అక్కడ మామయ్య వుండనేవున్నాడు. తలదాచుకుందుకు తంటాలుపడనవసరంలేదు" అన్నాడు వెంకటేశం. సోమేశ్వరరావు మాత్రం యింకేమంటాడు!

"సరే, నీయిష్టం..." అనేశాడు.

మద్రాసుపోయి ప్రయత్నిస్తేనేకాని వుద్యోగం దొరకదన్న అభిప్రాయాన్ని వెంకటేశం హృదయంలో నాటినవ్యక్తి పద్మావతి. ఆమెకి తగినబాధ్యత వుండటంవల్లనే యిలా అన్నదనుకున్నాడు వెంకటేశం. కాని, ఆమె చీకటితెరలలోయిముడుకున్న అభిప్రాయం వేరు. వెంకటేశందూరమైతే కమల అతన్ని మర్చిపోయి సులువుగా మారిపోయే అవకాశంవుందనే యీ యెత్తువేసింది. పాపం, ఆమెకి తెలీదు—యెడబాటు విరహాన్ని అధికంచేస్తుందని; వెంకటేశంకి ఈ లోతులు తెలీవు. పద్మావతి తన శ్రేయస్సు కోరుతున్నట్టుగానే భావించాడు. అతనికి తెలీదు సీతారాంవచ్చి జరిపిననాటకం.

మరుసటిరోజే మద్రాసు ప్రయాణంకట్టాడు వెంకటేశం. అతను బయలుదేరేవరకూ కమలజాడే కన్పించలేదు. కనీసం ఆమెతో చెప్పి వెళ్ళాలని అతనిఆశ. కాని ఆమె రాలేదు. ఎందుకు రాలేదో అర్థంకాలేదు—ఇల్లు దగ్గరలోనేవున్నా

అక్కడికి వెళ్ళడానికి మనస్కరించలేదు వెంకటేశంకి. ఉద్యోగం సంపాదించేంతవరకు వాళ్ళింటికి పోకూడదని నిశ్చయించుకున్నాడు.

"ఏంరా బండికి వేళవుతోంది మరి—బయలుదేరు" అంది సరళ ఏదో ఆలోచిస్తున్న తమ్ముడివేపు చూస్తూ.

"కమల వస్తుందేమోనని చూస్తున్నా నక్కా! చెప్పకపోతే ముఖం ముడుచుకుంటుంది" అన్నాడు వెంకటేశం.

"ఆ భయసంవున్నవాడివి వాళ్ళింటికి వెళ్ళి చెప్పకూడదూ!" అంది సరళ నవ్వుతూ.

నిజమే వేళ మించిపోతోంది. కమలతో తను మద్రాసు వెళ్తున్నట్టు చెప్పాలి. వాళ్ళింటికి వెళ్ళాలి—తప్పదనుకున్నాడు వెంకటేశం.

వెంకటేశం కమలయింటికి వెళ్ళేసరికి పద్మావతి ఏదో కుడుతూంది. కమలవంటగదిలోకి పోతూ వెంకటేశాన్నిచూచి ఆగిపోయింది.

"నేను మద్రాసు వెడుతున్నాను కమలా" అన్నాడు వెంకటేశం నవ్వుతూ.

"ఈవాళేనా!" అంది గతుక్కుమన్నట్టుగా కమల ఆమె ముఖంలో విచారరేఖలు ప్రస్ఫుటమయ్యాయ్.

"ఔను కమలా, యివాళే—యిప్పుడే! మళ్ళీ వారంరోజులలో తిరిగి వచ్చేస్తాను" అన్నాడు వెంకటేశం... కమల ముఖం వాడిపోయింది. పద్మావతిముఖం వికసించింది.

"ఉద్యోగం సంపాదించుకురా నాయనా! కాస్త ఆలస్యమైనా సాధించుకుని రా" అంది పద్మావతి నవ్వుతూ. ఆమె

అభిప్రాయం అతనికి వుద్యోగం దొరకాలని కాదు. వెంకటేశం ఆ వూరువిడిచి వెళ్ళటమే కావాలి పద్మావతికి.

"అలాగే నత్తా... వస్తాను కమలా" అంటూ వెళ్ళిపోయాడు. వెంకటేశం.

కమల తల్లి సాహసానికీ, ఆమెనటనకీ ఆశ్చర్యపోయింది. ఆమె అనుకుంది, వెంకటేశంతో వెళ్ళొద్దని చెప్పాలని. కాని తల్లి దగ్గరుంటే యెలాచెప్తుంది? ఏం చెప్పటానికి వీల్లేకపోయింది. వున్నపాటున కమల స్తంభించిపోయింది. వెంకటేశం మరో పదిరోజులకుగాని ఆమె కంటపడడు. యీ పదిరోజుల్లో యేం జరుగుతుందో, పరిస్థితు లెలా మారుతాయో యెవరికి తెలుసు? పొర్లి వస్తూన్న దుఃఖాన్ని దిగమ్రింగుకుంటూ తనగదిలోకి పోయింది కమల.

## 2

వెంకటేశం మద్రాసుప్రయాణంకట్టినరోజు సాయంకాలం కమల సోమేశ్వర్రావుయింటికి వచ్చింది. అప్పటికి సోమేశ్వర్రావు పత్రిక చదువుతున్నాడు. కమల రావటంతో చదువుతున్న పత్రికని టేబిలుమీద పడేసి—

"రావే కమలా! రెండురోజులనుండి యెక్కడా కన్పించలేదే?" అన్నాడు.

"ఇంట్లో పనులు ఒకంతట తెమలకుండావున్నయ్. తీరికలేక రాలేదన్నయ్యా!" అంది కమల లేని నవ్వును అప్రియత్నంగా తెచ్చుకుని. నిజానికి అది అబద్ధం; వాళ్ళమ్మ వెళ్ళొద్దంది. వెంకటేశం వున్నప్పుడిక తరుచుగాపోనిస్తూండటం

మంచిది కాదన్న అభిప్రాయం పద్మావతిది. అందుకే మందలించింది. కాని నిజాన్ని కప్పిపుచ్చింది కమల "అదేవిటో నే చెల్లీ! నువ్వు కన్పించకపోతే యేదో వెలితిగావుంటుందినాకు. తోబుట్టువు నాకు లేకపోవటం అప్పుడప్పుడు బాధగా వుంటుంది కూడా. ఎన్నోసార్లు చెప్పాను, అప్పుడప్పుడు వచ్చి పోతుండమని... పిన్నితోగూడా చెప్పాను; యిదంతా మీా యిద్దరికీ ఆ మూాడు ముడులూా పడేంతవరకే! తరువాత యిక్కడే వుంటారు" అన్నాడు సోమేశ్వర్రావు. మొదట్నుంచీ అతని మనోవాంఛ కమలని వెంకటేశానికిచ్చి పెళ్ళిచెయ్యాలని.

అన్నయ్య మాటలు విన్న కమల నివ్వెఱపోయింది. ఏం జవాబు చెప్పాలో ఆమె కర్థం కాలేదు. ఆమెకళ్ళల్లో నీళ్ళు గిఱ్రిన తిరిగిపోతున్నయ్. సరళ అప్పుడే అక్కడికి వచ్చింది. కమల మొహంలోని విచారరేఖలు స్పష్టంగా గమనించింది సరళ. "అదేవిటే కమలా, అలావున్నావ్?" అంది సరళ కమలకి దగ్గరగాపోయి. సోమేశ్వర్రావు ఆశ్చర్యంగా కమల వేపుచూశాడు. ఆమె మొహం మ్లానంగావుంది.

"ఏమయిందే కమలా అలా వున్నావ్?" అన్నాడు ఆతృతగా, కమలకి ఏంచెప్పాలో ఎలాచెప్పాలో తోచలేదు. కాస్సేపు మౌనంవహించింది. అప్పటికే ఆమె కన్నీటిధార చెక్కిళ్ళదాటి వచ్చేసింది. సోమేశ్వర్రావుకేమీా అర్థం కాలేదు.

"చెప్పమ్మాయ్..." అన్నాడు నెమ్మదిగా. కమల చెప్పక తప్పిందికాదు. "అమ్మకి కాస్త నువ్వయినా చెప్పన్నయ్యా!" అంది వణుకుతున్నకంఠంతో. "ఏమిటి కమలా చెప్పటం?" అన్నాడు సోమేశ్వర్రావు అదోలా ఆమెవైపు

చూస్తూ. "సీతారాంతాతయ్యతో వియ్యం జరుపుతుందట-" అంది అనలేక. ఇంక అధికం చెప్పలేకపోయింది కమల. అప్పటికి యేడుపాగింది కాదు- చీరచెంగుతో మొహం కప్పుకుంది. సోమేశ్వర్రావూ, సరళ విస్తుపోయారు.

"ఏమిటే కమలా, నువ్వు చెప్తున్నది నిజమా?" అన్నాడు సోమేశ్వర్రావు.

"ఔనన్నయ్యా!"

"ఎంతఘోరం...నాకు తెలీకుండా పిన్ని ఈ సంప్రతింపులు రహస్యంగా జరుపుతున్నదంటే యింకేమనుకోవాలి?" అన్నాడు సోమేశ్వర్రావు.

వెంటనే సరళకి ఒక అనుమానం తట్టింది—వెంకటేశానికి యీ విషయం తెలిసే అంతగా మనిషిమారిపోయి వుద్యోగాన్వేషణకి బయలుదేరాడనుకుంది.

"వెంకటేశంకి ఈవిషయం తెలుసునటే కమలా?" అంది గాబరాచెందుతూ. ఆమెకీ భయంగానేవుంది. కమలనంత గాఢంగా ప్రేమిస్తున్న తమ్ముడికి గతేమవుతుందా అని.

"తెలీదు వదినా! అమ్మ ఆవిషయాన్ని అందరికి అజ్ఞాతంగా వుంచింది. అమ్మే ప్రయాణం కట్టించింది బావకి. నేనొచ్చి నిజాన్ని చెప్తానేమోనని ఈ రెండురోజులూ రాకుండా ఆటంకపర్చింది" అంది కమల... మొదట్లో నిజాన్ని కప్పిపుచ్చినా యిప్పుడు చెప్పక తప్పిందికాదు.

"హూఁ! యింతవరకు నడిపిందన్నమాట నాటకాన్ని పిన్ని...ఆమెకి ధనంపై లాలస యెక్కువై పోయినట్టుంది. సీతారాం కొడుక్కంటే యేం తక్కువై పోయాడు వెంకటేశం?

ఆ సత్యంగాణ్ని చూస్తేనే నాకు తలనొప్పి. వాడూ, ఆ కళ్ళద్దాలు, ఓ కార్టూనులా వుంటాడు సీతారాం బాగా పిన్నికి మారిపోసినట్టుంది'' అన్నాను సోమేశ్వర్రావు కోపంగా. ఏం చేయాలో అయోమయంగా వుందతనికి. కమల యీ సత్యాన్ని బయటపెట్టిందేగాని, తల్లి యేమంటుందో నన్న భయం ఓ వేపున లేకపోలేదు.

"అన్నయ్యా! నేనే యీ సంగతి చెప్పానని అమ్మతో చెప్పేవు! మరి వస్తాను వదినా'' అంటూ కళ్ళు బాగా తుడుచుకుని వెళ్ళిపోయింది కమల. ఆమె పరిస్థితి చూచి సోమేశ్వర్రావు గుండెలు నీరైపోయాయ్... కమలే తన స్వంత చెల్లి అవుతే తనతల్లి తనకి వ్యతిరిక్తంగా యీ సంబంధాన్ని నిర్ణయిస్తుందా అనుకున్నాడు.

"ఇప్పుడేంచేస్తామండీ! కమల పరిస్థితి అలావుంటే యిక మా తమ్ముడి తీరెలావుంటుందో అర్థంకాకుండావుంది'' అంది సరళ. "నిజమే సరళా! జీవితంలో యిల్లాంటిక్లిష్టపరిస్థితులప్పుడప్పుడు వస్తూంటయ్. పిన్ని అకస్మాత్తుగా ఎందుకిలా మారిపోయిందో తెలీకండావుంది. ప్రశాంతంగా గడువుతున్న జీవితాల్లో యిదో తుపాను చెలరేగిందన్నమాట... నేనే వెళ్ళి మాట్లాడాలి పిన్నితో ... ఒప్పించాలి'' అన్నాడు సోమేశ్వర్రావు.

"ఔనండీ, యిప్పుడే వెళ్ళండి...క్షణం మనదికాదు; ఎప్పుడెలా పరిస్థితులు పరిణామం చెందుతుంటాయో!''

"ఔను సరళా! యిప్పుడే వెళ్తాను'' అంటూ లేచి వున్నపాటుగా బయలుదేరాడు.

మునిసిపల్ దీపం మిణుకు మిణుకు మంటోంది ఆరిపోదు. తేజోవంతంగానూ వెలగదు. కొడిగట్టిపుండిపోయింది. ఆ మసక వెల్తురులో సోమేశ్వరరావు ముఖం మ్లానంగా అగుపిస్తోంది. ఎంతో వ్యధపడుతున్నాడు మానసికంగా. అతని స్వవిషయం కాకపోయినా, సన్నిహితవిషయం. రెండు కావలసిన జీవితాల నాశనం చూడబోతున్నాడు. అదీ అతనిబాధ. దగ్గరల్లే అవటం వల్ల రెండు నిమిషాల్లో చేరుకున్నాడు. క్షణంముందే కమల కూడా యింటికి చేరుకునివుంటుంది. పద్మావతి సోమేశ్వరరావుని చూచి చిరునవ్వుతో—

"రా రా సోమేశం... రెండురోజులనుండి కన్పించ లేదేం...? కూర్చో" అంటూ ఆహ్వానించింది—పిన్ని సోమేశ్వర్రావు నిట్టూర్పుతో కుర్చీలో కూలబడ్డాడు.

"అవకాశం చిక్కకుండావుంది పిన్నీ..." అన్నాడు ముక్తసరిగా. అతని ముఖంలో యింతకుముందున్న వుత్సాహం యిప్పుడు లేకపోవటం పద్మావతి గమనించలేదు.

"వెంకటేశం మద్రాసు వెళ్లాడు...మంచిపనిచేశాడ్రా! ఎంతకాలమని వుద్యోగం లేకండా కూచ్చుంటాడు?" అంది పద్మావతి.

"ఆ! వెళ్ళాడు పిన్నీ. ఎవరో ప్రోత్సహించారు వెళ్ళమని... మదరాసు వెళ్ళేమాత్రం దొరుకుతుందా వుద్యోగం, పిచ్చిగాని. ఆరోజు రావాలి...ఆ! పిన్నీ, ఏమిటీపుకారు, యొంతవరకు నిజం?" అన్నాడు సోమేశ్వర్రావు.

"ఏ పుకారు?"

"మనకమలని సీతారాంకొడుక్కియిచ్చి పెళ్ళిచేస్తారని

చాలమంది అనుకుంటున్నారు" అన్నాడు సోమేశ్వర్రావు.
పద్మావతి మొదట్లో కాస్త షాక్ తిన్నా తమాయించుకుంది.

"ఔనురా...ఎన్నాళ్ళని యింక దీన్నిలా అట్టేపెట్టు కుంటాం? దీనితోటివాళ్ళంతా కాపరాలు చేసుకుంటున్నారు. సీతారాంఅన్నయ్య తనకి తానుగా వచ్చి అడిగాడు...మరేం చెయ్యను? వ్వూకొట్టాను. యింక నీతో యీవిషయం చెప్పా లనుకుంటున్నా" అంది పద్మావతి.

సోమేశ్వర్రావు చకితుడయ్యాడు. పిన్ని యింత కుట్ర పన్నుతుందని యెప్పుడూ అనుకోలేదు. పోనీ తన ముందయినా మెత్తబడుతుందనుకున్నాడు. కాని పద్మావతి మారలేదు.

"ఇంత కుటిలంగా ప్రవర్తిస్తావని నే నెప్పుడూ అను కోలేదు పిన్నీ" అన్నాడు ఆవేశంగా. పెద్దదాన్ని అలా యెదిరించినందుకు తనలో బాధపడ్డాడు తరువాత.

"సోమేశం..." గాద్గదికస్వరంతో వచ్చిందామాట పద్మావతి నోటినుండి.

"ఔను పిన్నీ! నే నెన్నోసార్లు నీకు చెప్పాను. కమలని వెంకటేశం కివ్వాలని, కమల నాకు సన్నిహితంగా వుండాలన్న వాంఛ నాది. అదేంవిటో నాకు అక్కచెల్లెళ్ళు లేకపోవటంవల్ల ఆ మమకారం పుట్టిందనుకుంటాను. వెంకటేశమైనా సత్యం కంటె అధ్వాన్నం కాదు. చదువుంది-సంస్కారముంది-అందం వుంది-అనుభవవుంది-యింకేంకావాలి? సత్యంకివున్నంత ఆస్తి లేకపోయినా జీవితానికి లోటులేకుండా ఆస్తివుంది. వీడిలో లేని ఆధిక్యత సత్యంలో యేముందని నిశ్చయించావ్ పిన్నీ? బహుశా డబ్బునిచూసే అనుకుంటాను" అన్నాడు సోమేశ్వ

రావు కఠినంగా. పద్మావతికి తెలుసు. సోమేశ్వరావు తప్పక వుద్రిక్తుడౌతాడని... కాని తన అభిప్రాయం వేరు. సీతారాం లక్షాధికారనుకోవాల్సిందే. ఆతని కా పూర్వోక్తమన్న పలుకుబడి మరెవ్వరికీ లేదు... ముఖ్యంగా సత్యం మంచి వుద్యోగంలో వున్నాడు...పోతే వెంకటేశంలో యివన్నీ లోపించాయి.

"ఎందుకురా ఆవేశం...నేనుమాత్రం వెంకటేశంకి పిల్ల నివ్వనన్నానా? నువ్వే ఆలోచించు_వుద్యోగంలేని వాడికి యెలా యివ్వడం? యెంత చదువుంటే ఎందుకూ? తనబ్రతుకు తనైనా బ్రతగ్గలడా?" అంది పద్మావతి ప్రశ్న పరంపరలు కురిపిస్తూ.

"వాడి బ్రతుక్కి లోటుండదని నీకు తెలియకపోలేదు. వుద్యోగం వుంటేనే కాని, జరగదన్న బాధలేదు...ఆస్తి వుందిగా కాస్తయినా?"

"అయుండొచ్చు...ఆ ఆస్తి నలా ఖర్చుబెడుతూంటే యెన్నాళ్ళుంటుంది? ఎప్పుడో ఓసారి ఉద్యోగావసరం తప్పదుగా"

"నిజమే పిన్నీ! యిప్పుడంటే నిరుద్యోగి కాని, కలకాలం అలానే ఉండిపోతాడా ? ప్రయత్నిస్తూనేవున్నాం. మొన్న వెళ్ళిన ఇంటర్వ్యూ ఫలితాలు రేపోమాపో తెలుస్తాయట. అవుతే అంతవరకూ వాడు అసమర్ధుడన్నమాటేనా?"

"ఏమిటోరా...నీకేం చెప్పినా ఒకంతట అర్ధంకాదు. నేనుమాత్రం ఆలోచించలేనంటావా! అవన్నీ సావకాశంగా ఆలోచించే నిశ్చయానికొచ్చాను"

"ఏం నిశ్చయం పిన్నీ...నువ్వు చేసినవన్నీ అవక

తవకలుగానే వున్నయ్. కమల కిష్టంలేని పెళ్ళిచేసి యేంలాభం చెప్పు?" అన్నాడు సోమేశ్వరరావు జేవురించిన ముఖం విసుగ్గా ప్రక్కకితిప్పుతూ.

"దాని కిష్టంలేకపోవడమేమిటిలే." ఆ అబ్బాయి కేం తక్కువ? చదువుకున్నాడు...వుద్యోగం వుంది...ఆస్తివుంది."

"అంతే చూశావు గాని, యీడూజోడూ మరి అవసరం లేదన్నమాట...సత్యాన్ని యెప్పుడైనా చూశావా? ఆ ఆకారాన్ని చూస్తే అసహ్యమేస్తుంది. అలాంటివాడికి నిక్షేపంలాంటి కమలని కట్టబెడుతున్నామంటే యెవరైనా నవ్వుతారు" అన్నాడు సోమేశ్వరరావు వుద్రేకాన్ని ఆపుకోలేక. పద్మావతి గుటకలుమింగుకొని కమల ఆ పరిసరాల్లో వుందేమోనని నలువేపులా చూస్తూ,

"వూరుకోరా...యిప్పుడవన్నీ యెవరుచూస్తున్నారు చెప్పు? బాబు బతుకు హాయిగా గడిచిపోతే అంతే చాలు..." అంది మెల్లగా కమల వింటుందేమోనని. ఆమె మాటల్లో అర్థం ఏమీ లేదు. చెప్పినమాటే పదిసార్లు చెప్తుంది. సోమేశ్వర్రావుకి విసుగనిపించింది.

"అవుతే యీ ప్రయత్నం ఆపడానికి వీల్లేదంటావా పిన్నీ!" అన్నాడు సోమేశ్వర్రావు సూటిగా ఆమెముఖంలోకి చూస్తూ. పద్మావతి చలించిపోయింది. తన హృదయంలో ఆపివేయాలన్న అభిప్రాయం లేదు. కాని అలాగని ఖచ్చితంగా చెప్పిందా దగ్గిర బంధువుల్లో సంచలనం చెలరేగుతుంది. ఎవరికీ వినికిడి లేకుండా చివరివరకు సన్నాహాలు జరిపేయాలనుకుంది. అదే ఆమెలో వున్న గొప్ప తంత్రం.

"చూద్దాం లేరా! యిప్పుడప్పుడే ముహూర్తం నిశ్చయించలేదుకదూ! వెంకటేశం వుద్యోగంకోసం వెళ్ళనే వెళ్ళాడు. రానీయ్..." అంది పద్మావతి. ఆమె మాటలు సోమేశ్వర్రావుకి కాస్త వూరట కలిగించాయి.

"వెళ్ళేమాత్రాన వుద్యోగం దొరుకుతుందన్న నిశ్చయం యేముంది పిన్నీ! ఎప్పుడా అదృష్టం కలుగుతుందో యెవరమూ చెప్పలేంగదా"

"సరే లేరా...చూద్దాంగా" అంది పద్మావతి.

"వెళ్ళొస్తా మరి...పిన్నీ" అంటూ వెళ్ళిపోయాడు సోమేశ్వర్రావు.

పద్మావతి తనలో తనే నవ్వుకుంది. ప్రస్తుత ప్రశాంతత కోసం అలా చెప్పిందిగాని సత్యాన్ని వదలుకొని వెంకటేశంకి తన కూతుర్ని యివ్వటం ఆమెకి మనసొప్పుతుందా? సత్యం తనకి అల్లుడు కావాలి - సీతారాం వియ్యంకుడవ్వాలి... అప్పుడూర్లో తనకీ పలుకుబడి వుంటుంది. కమల నందరూ అదృష్టవంతురాలని మెచ్చుకుంటారు. ఆమెకి తెలుసు, వెంకటేశంకి యే గుమస్తాగిరో తప్ప మరే మంచి వుద్యోగం దొరకదని. అదే విషయాన్ని యింతకుముందు సీతారాం యెన్నోసార్లు పద్మావతికి నూరిపోశాడు. ఎలాగైతేనేం పద్మావతి తనలో తనే సమాధానపడింది. వంటగదిదగ్గరికి పోతూ—

"కమలా..." అని పిల్చింది.

"ఏం అమ్మా..."అంటూ వంటగదినుండి వచ్చింది కమల. ఆమె కళ్ళు చెమ్మగిలి వున్నయ్. ఏకధారగా యేడ్వటం వల్ల గామోసు కళ్ళు సగం చిన్నవై పోయాయ్.

"అన్నయ్యతో మాట్లాడుతున్నప్పుడు నువ్వెక్కడున్నావే?"

"వంటగదిలోనమ్మా."

"మా మాటలన్నీ విన్నావుకదూ!" అంది పద్మావతి. ఆమె భయమంతా కమల సోమేశంతో సంభాషణ యెక్కడ విందోనని వింటే గొప్ప ముప్పువస్తుందని ఆమెకి తెలుసు. అందుకే అలా అడిగింది. కమలమాత్రం యేం తక్కువతిందని.

"లేదమ్మా...నేను వంటగదిలోనే వున్నానే" అంది కమల. నిజంగా ఆమె అంతా వింది. విన్నానని చెప్పిందా చీవాట్లు తప్పవు అందుకే అబద్ధమాడింది. పద్మావతి సంతృప్తిగా శ్వాసవిడుస్తూ

"అవుతే అమ్మాయ్, సత్యాన్నినువ్వుచూశావుకదూ!"

"చూశానమ్మా..."

"బావుంటాడుకదూ!" ముందుగానే మెలికవేసింది పద్మావతి కమలలో సదభిప్రాయం కలిగించాలని.

"పొట్టిగా వుంటాడే... ఆ మొహంలో కళ..." అని అంటూంటే పద్మావతి అందుకుని,

"నీ కిష్టమేకదూ!" అంది పద్మావతి.

"నా యిష్టంతో యేంపనిలే అమ్మా!"

"కానమ్మా! నీకిష్టంలేకపోతే నేను తలపెడతానా!"

"అలాగవుతే సత్యాన్ని వివాహంచేసుకోవటం నా కిష్టంలేదమ్మా" అనేసింది కమల—తల్లి అడిగిందికాబట్టి అలా చెప్పింది. లేకపోతే తల్లినియెదిరించే వ్యక్తి కాదు కమల. ఒక్కసారిగా పద్మావతి స్తంభించిపోయింది. కమలకు ఆకాస్సేపు

స్వాతంత్ర్యం ఇచ్చిందేగాని యిలా కథ అడ్డంతిరుగుతుందని అనుకోలేదు. ఎందుకూఅంటే యిన్నిరోజులనుండీ యీసంబంధ బాంధవ్యపు విషయాలు జరుగుతున్నా సత్యం తనకినచ్చలేదని యెప్పుడూ చెప్పలేదు కమల... ఒకవేళ నచ్చకపోతే చప్పున అప్పుడే చెప్పేసివుండే దనుకున్నది పద్మావతి. యీఆలోచనలు క్రమంగా ఆగ్రహంలోకి దిగాయి.

"మరెవర్ని చేసుకుంటావే?" అంది కోపంగా.

"వెంకటేశం బావనే..." అంది కమల కాస్త భయపడుతూనే...'ఫట్'మంది కమల చెంపమీాద.

"ఛీ! వెధవముండా; నీకు కాస్త చనువిచ్చానని యింత వరకు వచ్చావన్నమాట. పెద్దల అధికారాలూ, నిర్ణయాలూ పనికిరావు మీాకీ కాలంలో...మీా యిష్టమే అంతాను...వెంకటేశంకంటె సత్యం యేం తక్కువయ్యాడే" అంది ఛీత్కరించుకుని పద్మావతి. కమల వెక్కివెక్కియేడ్చింది. ఆమెకు తర్కం హెచ్చయింది. ఆ ఆవేశంలో తల్లి నెదిరిస్తున్నానన్న జ్ఞానం లేకపోయిందామెకి.

"నా కిష్టంలేదమ్మా! సోమేశ్వరన్నయ్య అన్నట్లు యీడూ జోడూ యెక్కడుందే?" అంది వుడుకుమోత్తనంగా. మొదట ఆ మాటలే వినలేదని చెప్పినా యిప్పటి ఆవేశంలో అనక తప్పిందికాదు కమలకి. తన కిష్టంలేదని ఖచ్చితంగా చెప్పేస్తే పద్మావతి ప్రయత్నం మానుకుంటుందేమో నను కుంది పాపం!... కాని పద్మావతి మనసు మార్చుకోలేదు. మార్చుకోదు కూడాను.

"అవుతే మా యిద్దరి సంభాషణ విన్నావన్నమాట...
వినలేదని చెప్పావెందుకే ఇందాక!" అంది కోపంగా పద్మా
వతి...

"అంతా వినలేదే... యీ ఒక్కమాటే విన్నాను"
అంది కమల, పద్మావతి అనుకుంది, కమలతో యిక ఆర్గ్యుమెం
టు పెట్టుకుంటే లాభంలేదని.

"సరేలే...మీ అన్నయ్యమాటలకేం... స్వార్థం
వుందిగా. వాడి వుబలాటమంతా నిన్ను వాడి బావమర్దికి చేసు
కోవాలని...కాని నేను నాతాహతుకి తగ్గవాళ్ళని చూసుకో
వద్దూ!" అంది పద్మావతి తనమనసు మార్చుకోలేనని చెప్తు
న్నట్లుగా. కమల యింకేం చెప్పదలుచుకోలేదు...పైకి వుబికి
వస్తున్న తన అభిప్రాయాన్ని బలవంతంగా వెనక్కినెట్టి మన
సులో పదిలపర్చుకుంది.



వెంకటేశం మద్రాసు చేరుకుని మేనమామ జగన్నా
థం యింటికి వెళ్ళాడు. అప్పటికి జగన్నాథం యింట్లోలేడు.
సాయంకాలం యిల్లు చేరుకుని వెంకటేశాన్ని చూచి
వుప్పొంగిపోయినట్లుగా నవ్వుతూ "మంచి సమయానికే
వొచ్చావురా వెంకటేశం...నీ కింకా వుత్తరం రాయాలను
కొంటున్నా" అన్నాడు జగన్నాథం. వెంకటేశానికి ఆశ మొల
కెత్తింది. తను నిరుద్యోగి అని తెలిసివున్న మామ బహుశా
వుద్యోగంవిషయమే మాట్లాడుతున్నాడనుకున్నాడు వెంక
టేశం.

"ఏం మావయ్యా! ఏదైనా ఉద్యోగం ఖాళీగా వుందా?" అన్నాడు వెంకటేశం ఆత్రంగా. జగన్నాథం మెల్లగా నవ్వుతూ

"ఉద్యోగాని కిప్పుడేం తొందరొచ్చిందిరా? ఆ రోజు వస్తే దొరక్క మానేస్తుందా!" అన్నాడు. చివురించిన వెంకటేశం ఆశలు మళ్ళీ చిదుమబడ్డాయి; ఒక్కసారతని మొహం రంగుమారింది. కాస్సేపు ఆలోచనలో పడ్డాడు. జగన్నాథమే మళ్ళీ మొదలుపెట్టాడు.

"నువ్వీపాటున పెళ్ళికి ఒప్పుకున్నావంటే పెళ్ళిముగిసిన మరుసటిరోజే ఉద్యోగం దొరుకుతుందిరా..." అన్నాడు జగన్నాథం గర్వంగా...తనే ఆ ప్రయత్నం చేశానన్నట్టుగా. వెంకటేశం సూటిగా మావయ్య మొహంలోకి చూశాడు.

"పెళ్ళా మామయ్యా!" అన్నాడు ఆశ్చర్యపోతూ.

"ఔనురా; ఏం, పెళ్ళిచేసుకోవా? ఎవరో తెలుసా?... తహసిల్దారు కూతురు...మంచి ఆస్తివుంది. నిన్నెప్పుడో మా యింట్లో చూశాడట వాళ్ళనాన్న...వూరికే నా ప్రాణాలు తీనేస్తున్నాడు నిన్ను రప్పించమని...ఈ సంబంధం నిశ్చయించమనీ. ఉద్యోగం లేకపోయినా పర్వాలేదుట. అతనే ఉద్యోగం యిప్పిస్తాడుట" అన్నాడు జగన్నాథం. వెంకటెశంకి యేడవాలో నవ్వాలో అర్థంకాలేదు...పిచ్చిగా నవ్వుకున్నాడు తనలో. అసలు, ఉద్యోగప్రయత్నంకోసం యింత దూరంవచ్చింది యెందుకు? కమలని పెళ్ళిచేసుకోవాలనేగా. ఆ మెదూరమైపోవటం తను సహించలేడు. వుద్యోగం లేకపోతే పద్మావతి వూహా మారిపో వచ్చున్న అనుమానంతోనే యీ ప్రయాణంకట్టాడు. అట్లాం

టిది వుద్యోగంకోసం యింకెవరినో పెళ్ళాడితే తను రావటంలో అర్థంలేదు అనుకొన్నాడు వెంకటేశం.

'ఇప్పుడు నేను పెళ్ళిచేసుకోను మావయ్యా! మొదట వుద్యోగమంటూ యేదో దొరికితేగాని, నేనేంచేయాలో అర్థంకాదు."

"అదేమిట్రా! నామాటల్ని పూర్తిగా అర్థంచేసుకోవేం? వాళ్ళే వుద్యోగం చేయిస్తామంటున్నారుగా"

"అవసరంలేదు మావయ్యా! నేనొచ్చినపని చూసుకొని వెళ్ళిపోతాను" అన్నాడు వెంకటేశం అసలు తను రావడం వుద్యోగసమస్య వెంటేసుకునే వచ్చాడు. కవుల విషయం మావయ్యతో చెప్పలేదు చెప్పే అవసరంకూడా లేకపోయింది.

"అవుతే యిప్పుడేం పనిమీద వచ్చినట్టురా?" అన్నాడు జగన్నాథం చిన్నబుచ్చుకుంటూ నిజమే! చిన్నతనం కాదూ! తన మాట మేనల్లుడు పూర్తిగా కొట్టిపారేస్తున్నాడంటే చిన్నతనమే మరి... వెంకటేశంగుండెల్లో రాయి పడింది... తనేం పనిమీద వచ్చానని చెప్తాడు?

నిజం చెప్పాలి, తప్పదు;

"నేను పంపిస్తున్న [illegible] [illegible] ఆఫీసుకి పోయి చూడాలని వచ్చాను మావయ్యా!"

"ఎందుకురా ఇంత శ్రమ! కావాల్సి [illegible] వుద్యోగాన్ని కాదనేస్తున్నావ్, ఆలోచించుకో మరి"

"తెలియక [illegible] మావయ్యా! ఆ ఆఫీసులో నా స్నేహితుడొకడున్నాడులే, సహాయం చేస్తాడన్నా..." అన్నాడు వెంకటేశం. కాని స్నేహితుడున్నమాట [illegible] లేదు. [illegible]

చెప్పాడు; చెప్పాల్సివచ్చింది కమలకోసం. జగన్నాథంకి వెంక టేశంపై అసహ్యం కలిగింది. మేనల్లుడు తహసీల్దారు అల్లుడౌతే తనకి కాస్త పలుకుబడివుండునన్న అభిప్రాయాన్ని వెంకటేశం రూపుమాపాడు. అందుకే యీ కోపమంతా. ఇంకే యితర ప్రశ్నలు వేయలేదు.

మామయ్యలో మార్పు కాస్త వెటకారంగా కన్పించ టంతో వెంకటేశంకి యింక అక్కడుండాలన్న వాంఛ అంత రించింది. వారంరోజు లుండాలను కొని వచ్చినవాడు, తన కార్యం సాఫల్యంకాకండానే మూడురోజులకేం విసుగెత్తి పోయాడు. మూడోరోజురాత్రి మళ్ళీ ప్రయాణంకట్టాడు, బావ అక్కల దగ్గరికి. పయనమవుతున్న మేనల్లుణ్ణి జగన్నాథం మాటవరుసకైనా వుండమనలేదు. ఇలావుంటయ్ మనుషుల మనస్తత్వాలు అనుకొన్నాడు—వెంకటేశం రైలు బండిలో ప్రయాణంచేస్తూ.

# 3

"ముహూర్తం దగ్గర పడుతోంది చెల్లీ! పట్టుమనిచూస్తే మరో పదిరోజులైనాలేదు... ఆ ముహూర్తం తప్పితే అంత శుభముహూర్తం మరో సంవత్సరంలోగా లేదంట" అన్నాడు సీతారాం ముసిముసి నవ్వులతో.

"అప్పుడే ముహూర్తం చూపించావేమి టన్నయ్యా!" అంది పద్మావతి. ఆమె హృదయం చీకటివెలుగుల్లో వూగిస లాడుతూందింకా. వెంకటేశంకి కమలనిచెయ్యటం సుతరామూ

యిష్టం లేకపోయినా సోమేశ్వరరావుభయం ఉండనే ఉంది... మరోవేపు సీతారాంకొడుకు ఔన్నత్యం కళ్ళకి కనపడుతుంది.

"జానకు చెల్లీ...వీళ్ళమ్మ పూరికే ప్రాణాలు తీసేస్తోంది. ఎప్పుడు కోడలువస్తుందా అని దాని ఆరాటం" అన్నాడు ప్రక్కనేవున్న కొడుకువేపుచూస్తూ సీతారాం ... ఆరోజు సత్యంకూడా వచ్చాడు తండ్రివెంట. సత్యం తెల్లని సిల్కు సూటువేసుకున్నాడు. పద్మావతి యింతకుముందెన్నోసార్లు చూసింది సత్యాన్ని...అప్పటికంటె యిప్పుడెంతో బావున్నాడామెదృష్టికి. ఏదేనా మనసుంటేనే మనువంటారు. మనసుంటే అన్నీ సవ్యంగావుంటయ్... అన్నీ అందంగా ఉంటాయి. కమల యింతకుముందూ చూసింది, యిప్పుడూ తలుపుచాటు నుండీ చూసింది సత్యాన్ని. ఆమెదృష్టిలో యెప్పుడూ ఒకేలాగు వున్నాడు సత్యం తన దురదృష్టానికి నిట్టూర్పు విడుచుకుందంతే!

"మా సోమేశ్వరరావుకూడా చెప్పాలన్నయ్యా! ఎంతయినా మాకు మగదిక్కు వాడేకదూ!" అంది పద్మావతి.

"ఆఁ! యేమిటో నువ్వావేళ చెప్పినట్టు కమలని వాళ్ళ బావమర్దికి తప్ప మరొకరికిస్తుంటే ఒప్పుకుంటాడన్న నమ్మకమేదీ? ఎలాగూ వుద్రేకం పుడుతుంది" అన్నాడు సీతారాం. పద్మావతి అంతకుముందే అన్ని విషయాలు వివరంగా చెప్పింది సీతారాంతో... ప్రస్తుతం పద్మావతి పాలెపట్టులో ఇరుక్కుంది ... బయటికి రాలేక గిజగిజలాడుతోంది. సీతారాంతో వియ్యంపొందాలని దృఢాభిప్రాయం వుంది. కాని సోమేశ్వరరావు అడ్డొస్తున్నాడు. వెంకటేశం వుద్యోగంకోసం వెళ్లాడు.

వాడి అదృష్టమూలాన వుద్యోగం సంపాదించుకొనివస్తే సోమేశ్వర్రావు కమలని బావమర్దికిచ్చి చెయ్యమని బలవంతం చేస్తాడు...వాడి కాపాక్కుంది... అప్పుడు తను యెదురు తిరగలేదు. ఎదురుతిరిగి నిరాకరించటానికి మరో మార్గంలేదు.

"అప్పుడే నేనేం నిర్ణయించలే నన్నయ్యా! వెంకటేశం మద్రాసు వెళ్ళాడు వుద్యోగ ప్రయత్నాలకోసం. వాడికి వుద్యోగం దొరికితే సోమేశ్వర్రావు వూరుకుంటాడా? కమలని బయటకి పోనివ్వడు..." అంది పద్మావతి. సీతారాం నవ్వాడు.

"మద్రాసుపోయి ప్రయత్నిస్తే మాత్రం వుద్యోగం దొరుకుతుందా? ఏవిటో అంతా భ్రమ... నేను మావాడి కోసం యెంత ప్రయత్నించా ననుకున్నావ్. అప్పటికీ సాధ్యం కాకపోతే నా పలుకుబడి నుపయోగించి పెద్దపెద్దవాళ్ళని ఆశ్రియించాల్సివచ్చింది... అయినా వెంకటేశం నిన్న సాయంకాలంబండిలో మద్రాసునుంచి వచ్చేశాడే!" అన్నాడు సీతారాం. పద్మావతి ఆశ్చర్యపోయింది అప్పుడే యెలా తిరిగి వచ్చేశాడా అని. కొంపదీసి వుద్యోగం దొరికిపోలేదు కదా! అదే ఆమెభయం. వెంకటేశం ప్రయత్నాల ఫలితం తెలుసుకోవాలని ఆమె ఆతృత...

కమల తలుపుచాటునవుండి విని గతుక్కుమంది. నిన్న సాయంకాలం వచ్చిన వెంకటేశం యింతవరకు కనీసం తనని చూడ్డానికైనా రాకపోవటమేమిటి? బహుశా వుద్యోగం దొరకలేదేమో! అందుకే బిడియపడి రాలేదేమో! అని నిరుత్సాహపడింది కమల.

"వచ్చేశాడా వెంకటేశం! ఏదీ ఇంతవరకూ యిక్కడికి రాలేదే!" అంది పద్మావతి ఆశ్చర్యపోతూ.

"ఎందుకొస్తాడూ? వుద్యోగం దొరికితేగా వుత్సాహంతో రావటానికి... ఏ మొహం పెట్టుకుని వస్తాడూ!" అన్నాడు సీతారాం...సత్యం విగ్రహంలా కిక్కురుమనకండా కూర్చున్నాడు. సీతారాంమాటలువిన్న కమలకు కోపం హెచ్చింది. కాని యేంచేస్తుంది...!

పద్మావతి యిప్పుడు కాస్త కుదుటపడింది. వెంకటేశం యింత త్వరలో తిరిగిరావటంవల్ల, తన యింటి కింతవరకూ రాకపోవటంవల్ల వుద్యోగం దొరకలేదని స్థిరమయ్యింది. సోమేశ్వరావుకూడా యిక బలవంతపర్చటానికేమీఆధారాలు లేవు. అయినా అడక్క వూరుకుంటాడా? అంతకీ కావలిస్తే బావమర్దిని తనయింట్లో వుంచుకుంటా నంటాడు. అదీ ఒకసమస్యే. అప్పుడేం చేస్తుంది తను?...ఏమైనా సీతారాంవియ్యం వదులుకోవటం తెలివితక్కువ అనిపించిం దామెకి.

"ఔనన్నయ్యా! నువ్వన్నదే నిజం...వుద్యోగం దొరికివుంటే తప్పకండా వచ్చేవాడే. అంత త్వరలో దొరుకుతుందన్న ఆశకూడా లేదు" అంది పద్మావతి.

"అందుకే, మరేమంటావ్...? ఆలస్యం అమృతం విషం...అన్నారు పెద్దలు. ముహూర్తం నిశ్చయించేయిస్తాను" అన్నాడు సీతారాం ఆసక్తితో. సత్యం దించినముఖాన్ని ఓసారెత్తి పద్మావతివేపు చూశాడు యేంచెప్తుందోనని. పద్మావతి ఆలోచనలోపడింది. ఆలోచనలు గొలుసులా అల్లుకుపోతున్నయ్... ఎంతసేపాలోచించినా యింకేముంది గనక...

మళ్ళీ మొదటికే వస్తోంది, మనోనిశ్చయం.

"అలాగే నన్నయ్యా! ఎంత బుర్రకొట్టుకుని ఆలోచించినా మరోమార్గం అగుపించకండా వుంది... ముహూర్తం పెట్టించు... చివరివరకు యెవ్వరికీ తెలియనివ్వకూడదు."

అంది మెల్లగా కమలకి విన్పిస్తుందేమోనని. తల్లి యేం జవాబిస్తుందోనని ఆసక్తితో వింటూన్న కమలకీమాటలు విన్పించలేదు—ఏం జవాబుచెప్పిందో తెలీక సతమతమై బాధపడింది.

సీతారాం, సత్యం యిద్దరూ ఒకరిమొహం ఒకరు చూచుకొని నవ్వుకున్నారు సంతృప్తిగా... నవ్వినప్పుడు సత్యంమొహం వికృతంగా వున్నా, పద్మావతికి అతనిలోని అనాకారం అగుపించలేదంటే ఆశ్చర్యంలేదు... ఆమెదృష్టి ధనం, వుద్యోగం, పలుకుబడి వీటిపై నేవుంది!

"వస్తాం మరవుతే..." అంటూ లేచాడు సీతారాం. పద్మావతి వాళ్ళిద్దరివెంట వసారావరకు పోయింది.

"తక్కిన విషయాలు తరువాత మాట్లాడుకుందామన్నయ్యా! మొదట ఆ కాస్త ముహూర్తం నిశ్చయించేస్తే ఆటంకంరావడాని కవకాశం వుండదు" అంది పద్మావతి.

"అలాగే కానియ్ చెల్లీ ...పరాయివాళ్ళం గనకనా.! మరి నువ్వుండు" అంటూ ముందుకి సాగాడు ముసిముసి నవ్వుల్తో సీతారాం.

పద్మావతి యింట్లోకి వస్తూ "ఏమేఁ కమలా! యెలా వున్నాడే సత్యం? చక్కగా వుంటాడుగదూ! నలుపన్నమాటే గాని యీడూజోడూ యెంతో బావుంటుంది" అంది కమలకి దగ్గరగాపోయి. కమల దుఃఖాన్ని దిగమ్రింగుకోవాలని ప్రయ

త్నించింది. ఏం జవాబు చెప్తుంది? మౌనం వహించింది.

"ఏవేఁ, చెప్పవేం...! నాతో చెప్పటానికి సిగ్గు యేమిటే?" అంది నవ్వుతూ పద్మావతి. కమల కోపం కట్టలు తెగి ప్రవహించింది. సత్యంపట్ల తనఅభిప్రాయం యెప్పుడో వెలిబుచ్చింది. యింకా అదే విషయాన్ని తల్లి పదే పదే అడగడంలో అర్థం లేదనుకుంది.

"నా అభిప్రాయం అప్పుడే చెప్పేశాగదమ్మా ...ఎదురుతిరిగే ధైర్యంకూడ నాకులేదు..." అంది కమల ఆవేశాన్నాపుకోలేక. ఆమె మాటల్లోనే వ్యంగ్యంగా ఆఅర్థం వెలిబుచ్చింది. కాని పద్మావతి ఆ అర్థాన్ని అంతలోతుగా తీసుకోలేదు.

"పిచ్చిపిల్లా... ఎదిరింపుదేనికే? ఎంతో అదృష్టవంతురాలివి, తెలుసా...?" అంది నవ్వేస్తూ.

కమల పిచ్చిగా తనలో నవ్వుకుంది...తను ఎంతో అదృష్టవంతురాలు— అల్లాంటి భర్తని పొందటం పూర్వపుణ్యంవల్ల కలిగిన అదృష్టం...కమలగుండెల్లో యెవరో సమ్మెటతో కొడుతున్నట్టయింది...ముఖం తిరిగిపోతూంది... ఆమెకళ్ళు చెమ్మగిల్లాయి.

"ఔనమ్మా ...అదృష్టవంతురాలినే...!" పేలవంగా అంటూ తనగదిలోకి పోయింది కమల.

గదంతా చీకటిగావుంది. పట్టపగలే చీకటిగా యెందుకుందా అనుకుంది. ఆమెకు జ్ఞాపకంలేదు, కిటికీరెక్కలు మూసి వున్నయ్యని... పోయి కిటికీ రెక్కల్ని తెరిచింది. దూరంగా పర్వతశిఖరం ఆకాశాన్నంటుకున్నట్టుగా అగుపిస్తోంది. గాలి రివ్వుమంది... చెట్టుదగ్గర సుడిగాలి చెలరేగింది ... ఆకులు,

కాగితపుముక్కలూ గాలిలో తేలి యెక్కడికో ఎగిరిపోతు న్నయ్... మళ్ళీ యెక్కడ యెలా పడతాయో ఆమెవూహ కందలేదు... తన బ్రతుకూ అలా నేవుందనుకుంది కమల. చక్కని వుపమానం! నిజమే! తన భవిష్యత్తు యెలా వుంటుందో తనకే తెలీదు...కిటికీరెక్కలు మూసింది. మళ్ళీ అంతా చీకటి...



కమల సోమేశ్వర్రావు యింటికి తరుచుగా వెళ్ళటం తగ్గించింది. కమలకి వెళ్ళాలనివున్నా పద్మావతి కట్టుబాటు చేసింది. సోమేశ్వర్రావు కమల తరుచుగా కన్పించకపోవ టంతో యేదో వెలితిగా బాధపడుతూండేవాడు. తనకి ఓచెల్లె లుంటే యీబాధ వుండేదికాదనుకున్నాడు, ఎందుకో ఆ వా త్సల్యం... తోబుట్టువుకున్నంత మమకారం... అనుకునే వాడు. ఇక వెంకటేశంబాధ వర్ణనాతీతం. ఎంతో అరుదుగా వస్తున్నా కమల వెంకటేశంతో మునుపటిలా మాట్లాడేందుకు వెనుకంజవేసేది... ఎందుకనో తెలీక బాధపడుతూండేవాడు వెంకటేశం.

ఓరోజు సాయంకాలం అయిదుగంటలకి కమల సోమే శ్వర్రావు యింటికి వచ్చింది. అదీ పద్మావతి అనుమతి తీసు కునే...పద్మావతి అనుకున్నది... ఆ సమయానికి వెంకటేశం యెక్కడికైనా బయటకిపోయివుంటాడని. అందుకనేవెళ్ళమంది. ఆమె అభిప్రాయం అతనికంటబడకూడదని కాదు — కాని తరుచుగా అతని కళ్ళబడకూడదని— ఆతనితో సంభాషణ

వుండకూడదని. కాని ఆమెఅభిప్రాయానికి భిన్నంగా జరిగిం దా రోజున. వెంకటేశం యింట్లోనే వున్నాడు. సోమేశ్వర్రావుఆఫీసు నుండి రాలే దింకా సరళ పక్కింటికి ఏదో పనిమీదపోయింది. కమల మెల్లగా అడుగులు వేస్తూ లోపలికి వచ్చింది. వెంకటేశం ఒంటరిగా కూర్చుని సిగరెట్ పీలుస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. కమల వచ్చిందన్నధ్యాసే కలుగలే దతనికి. కమల వంటగదిలోకి పోయింది. అక్కడా లేదు వదిన... యేం చేయాలో తోచలేదు. వెంకటేశాన్ని పలకరించేపాటి ధైర్యం లేకపోయింది కమల కప్పట్లో. ఆధైర్యం ఆ చనువు కొద్దిదినాల క్రితమే అంతరించాయి. ఏముఖంపెట్టుకుని వెంకటేశంఎదుటికి పోతుంది తను? అతన్ని మోసంచేసి మరొకార్ని చేపట్టబోతోంది తను... అవుతే, తనేం బాధ్యురాలు కాదుగా! పెద్దల కనుసన్నల్లో మెలిగే తను ఏం చేయగలదు? తిరిగి ఇంటికి పోవాలనుకుని ముందడుగు వేసింది. కాని మనసు వెనక్కి లాగుతోంది. బలవంతాన నాలుగడుగులు ముందుకి వేసింది. చప్పున ఎందుకో ఆగిపోయింది. వెంకటేశం ముందుకి నవ్వుతూ వచ్చాడు.

"ఏం కమలా! దొంగలావచ్చి మళ్ళా దొంగలా పోవాలని ప్రయత్నిస్తున్నావ్? నాతో మాట్లాడం యిష్టం లేకనా?" అన్నాడు. నవ్వుతూనే అన్న ఆమాటలు అంకుశాల్లా బాధించినయ్ కమలని. ఆమెకి దుఃఖం పొర్లివచ్చింది.

"అలా అనకు వెంకటేశం... నాకెందు కిష్టంవుండదు

చెప్ప—? అంది ముక్తసరిగా ఆమెకళ్ళల్లో నీళ్ళు తొంగి చూస్తున్నయ్.

"ఏం కమలా! అలా వున్నావ్?" ఆమెకళ్ళల్లోకి చూస్తూ అన్నాడు వెంకటేశం. కమల గతుక్కుమంది— తనెంత సహనంతో దుఃఖాన్ని లోపల మ్రింగుకున్నా వ్యక్త పడిపోయింది.

"ఏంలేదు వెంకటేశం—బాగానే వున్నానే! నీ కెలా కన్పించానో మరి. ఆ, వదినేది?" కాస్త ధైర్యంతో జవాబిచ్చి సంభాషణ మార్చింది కమల

"పక్కింట్లో వుందిలే గానీ,నువ్వెందు కలా మౌనంగా వున్నావ్, చెప్ప?" అన్నాడు వెంకటేశం. కమలకి తెలుసు యేదేనా విషయం సాంతం తెలిసేవరకూ విడిచిపెట్టడు వెంకటేశం.

"ఏంలేదు; వూరకనే!"

"ఊరకనే యెవ్వరూ అలావుండరు...యేదో కారణం వుండాలి. సరేగానీ. మీ అమ్మ యేమంటోంది?"

"ఏ విషయంలో? "అంది కమల తనకేం అర్థంకా నట్లుగా. ఆమెకి తెలుసు యేవిషయం అడిగాడో!

"మనపెళ్ళి ...నాకు వుద్యోగమయేటంతవరకూ ఆ విషయం తేవద్దంటోందా!" అన్నాడు వెంకటేశం ఆమెముఖం లోకి చూస్తూ. కమలకి యేడుపొచ్చింది. పిచ్చి వెంకటేశం యింకా స్వప్నంలోవున్నాడనుకొంది. పాపం! నిజంచెబితే అక్కడే కూలిపోతాడేమో! తనన్నివిధాలా వెంకటేశాన్ని చీకట్లోవుంచి మోసంచేస్తున్నానేమో అనుకుంది—అలాగని

నిజంచెబితే అతనిలో అసంతృప్తి పేరుకుంటుందని ఆమెకి తెలుసు.

"ఏమో వెంకటేశం! నాకేం తెలుసు చెప్పు? అన్నయ్య వచ్చి ఆరోజున మాట్లాడాడుగా..." అనిమాత్రం అనగలిగింది.

"అదేవిటో కమలా! నేను మద్రాసువెళ్ళిన ముందు రోజునుండి నువ్వు చాలా మారిపోయావ్... నే నేం తప్పు చేశానని అలా దూరదూరంగా తప్పించుకుని తిరుగుతావ్?" అన్నాడు వెంకటేశం. అతనికంఠం బొంగురుపోయింది—అంత జాలిగా అన్నాడు. కమలకి కన్నీ రాగింది కాదు.

"నే నేం దూరంగా తిరగలేదు వెంకటేశం...మాఅమ్మ కాస్త కట్టుబాటుచేస్తోం దిప్పుడు" అనిమాత్రం అనగలిగింది. అలా అందేగాని తను ఓ వేపు దూరంగానే వుంటోంది. వుండ కేంచేస్తుంది? వుండాలి—ఎలాగూ తను వెంకటేశానికి శాశ్వతంగా దూరమౌతుంది. ఆ దూరమవ్వటం యిప్పట్నుంచే అలవర్చుకుంటూంది. కాని నిజాన్ని చెప్పలేదు వెంకటేశంతో.

"ముందులేని యీ కట్టుబాట్లు ఎందుకొచ్చాయ్ కమలా? మీ అమ్మ అభిప్రాయం మార్చుకుందా?" అన్నాడు వెంకటేశం. కమల మౌనం వహించింది.

"చెప్పు కమలా!" వత్తిడిచేశాడు వెంకటేశం. కమల యేం చెబుతుంది? తనకి వేరే సంబంధాన్ని చూస్తున్నారన్న సత్యాన్ని బయటపెడుతుందా!

"యేం లేదు వెంకటేశం. వయస్సులో వున్న పిల్లని కదా, అందుకే" అంది కమల మెల్లగా.

"ముందు లేనివయసు యిప్పుడే వచ్చిందన్నమాట—

వూ॥" అన్నాడు వెంకటేశం నిట్టూరుస్తూ.

"ఎందుకులెద్దూ యీ ప్రశ్నలన్నీను—మళ్ళీవస్తాను. వదినె లేదుగా" అంటూ బయలుదేరబోయింది కమల. ఆమెకి తెలుసు యింకా అక్కడుంటే లక్షప్రశ్నలువేస్తాడు వెంకటేశం. వాటికి తను సమాధానాలు చెప్పలేక సతమతమౌతుంది.

"ఏం! మీ వదినె లేకపోతే నీకిక్కడ యెవరితోనూ పనేలేదన్నమాట" అన్నాడు వెంకటేశం. ఎంత సూటిగా, వ్యంగ్యంగా అడిగాడు? ప్రశ్నశూలంతో పొడిచినట్టుగాఅనిపించింది కమలకి. వెంకటేశం యింక అక్కడుండలేదు. వుడుకు మోత్తనం హెచ్చయి కాస్త దూరంగాపోయి కిటికీగుండా యేదో చూస్తున్నాడు.

కమలకి తెలుసు వెంకటేశం అసంతృప్తిపడతాడని — కాని యిందుకో తనదేం తప్పుంటె? నిజం సెడలోవుంచి యింకా యెలా నచ్చజెప్పాలా అని ఆలోచిస్తోంది.

"ఏమిటి కమలా, అలానిల్చున్నావ్ పరాయియిల్లులా?" అంటూ వచ్చింది సరళ. కమల గతుక్కుమంది.

"ఏమీలేదు వదినా! అంటె."

"వా డేమిటీ ఆవేపు మొహంతిప్పుకు నిల్చున్నాడూ?" అంది సరళ– "ఏమైనా ఘర్షణ జరిగిందా యిద్దరికీ?"

"లేదు వదినా— నేనొచ్చి అప్పుడే చాల సేపయి పోయింది. వస్తాను వొదినా." అంటూ నిల్చున్నపాటున తుర్రుమంది. ఆమె భయమంతా యింకేం విషమసమస్యలు యెదుర్కొంటానో నని.

"పిచ్చిపిల్ల...మహా అమాయకురాలు —" అంది

కమలవెళ్ళిన వేపుచూస్తూ సరళ.

"అవుతే అక్కయ్యా! పద్మావతిఅత్త యిప్పుడెందుకిలా మారిపోయిందంటావ్...? కమల పుట్టినదానికి అమ్మ కోప్పడు తుందంటుండే! యిప్పు డంత అదుపులో వుంచుతోందా?" అన్నాడు వెంకటేశం అక్క వేపుతిరిగి. సరళ కిప్పుడో సమస్య యెదురొచ్చింది. తనేం చెబుతుంది? పద్మావతి మారిపోయి కమలని హద్దులోవుంచటం నిజం. ఎందుకలా మారిందో తనకి తెలుసు... అవుతే ఆ విషయం చెబుతుందా? చెప్పాలి మరి...ఎప్పుడో ఓసారి చెప్పాలిగా! తప్పదు...

"ఏం? కమల చెప్పలేదురా?"

"ఎంతడిగినా చెప్పేగా. నల్లరాతి విగ్రహంలా మౌనం దాలుస్తుంది" అన్నాడు వెంకటేశం విసుగ్గా. సరళ చెప్పక తప్పిందికాదు.

"కారణా లున్నయ్ రా... లేకపో లేదు"

"ఏవిటా కారణాలూ?" విస్తుపోతూ అడిగాడు వెంకటేశం.

"కమలకి మరో సంబంధం వచ్చిందట——" అంది సరళ. వెంకటేశం ఒక్కసారిగా త్రుళ్ళిపడుతూ అక్కముఖంలోకి చూశాడు జాలిగా.

"నిజంగానా అక్కా..." అన్నాడు. సరళ కరిగిపోయింది. తమ్ముడు తనఇంట్లో వుండకుండా యింకెక్కడో దూరదేశంలో వున్నట్టయితే యీ సమస్య యేర్పడేదికాదనుకుంది.

"ఔను వెంకటేశం...సీతారాం తన కొడుక్కి కమల నివ్వమని అడుగుతున్నాట్ట."

"కమల యిష్టపడిందా?"

"లేదు, మొన్న నువ్వు మద్రాసు వెళ్ళినప్పుడు కమలే యీ విషయం చెప్పింది బాధపడుతూ... వెంటనే మీ బావ వెళ్ళి అడిగారు కూడాను."

"అవుతే యేమంది పద్మావతి?"

"ఏ మంటుంది? నీకు వుద్యోగం లేకపోవటం ఆమె కదో మిషగా దొరికింది. నువ్వు వుద్యోగం యిప్పుడైనా సంపాదిస్తే అభ్యంతరం లేదంది. కాని నీ దురదృష్టం...మద్రాసు వెళ్ళినా నిరాశతో తిరిగివచ్చావ్. యిప్పుడేమంటుందో!" అంది సరళ. వెంకటేశం నిర్ఘాంతపోయాడు. అతనికళ్ళు చీకట్లుకమ్మాయి. తనెక్కడున్నాడో అతనికే తెలీలేదు "అవుతేయిప్పుడే మాతుం దక్కా?" అమాయకంగా ప్రశ్నించాడు.

"నువ్వు మద్రాసునుండివచ్చాక యింకా ఆ ప్రస్తావనే రాలేదు...బావని మళ్ళీ పంపాలి. మీ యిద్దరిఅదృష్టం యెలా గుందో మరి..." అంది సరళ. ఆమెకీ తెలీదు—ప్రయత్నాలు పరోక్షంలో రహస్యంగా జరిగిపోతున్నయ్యని. వెంకటేశం నిట్టూరుస్తూ కిటికీవేపు తిరిగాడు.

"ఊఁ! యింతవరకు వచ్చిందన్నమాట కథ—అవుతే నే నింకా కలల్లో కొట్టుకుపోతున్నా నక్కా...ఎంత వింతగా వుంటాయి మనుషుల మనస్తత్వాలు? నాకు వుద్యోగం లేదన్న ఒక్క కారణంతో నా జీవితమే నాశనమవుతుం దన్నమాట" అన్నాడు వెంకటేశం. సరళకి భయమేసింది. తమ్ముడు మహా ఆవేశాపరుడు.

"ఎందుకు, అంతగాదిగజారిపోయి నిస్పృహపడతావ్?

యింకా వ్యవధివుందిగా. మీ బావ అన్నారు పద్మావతి నెలా గైనా ఒప్పిస్తానని...యీలోగా నీకు వుద్యోగం యెలాగూ దొరుకుతుంది" అంది సరళ కాస్త ధైర్యం చెబుతూ.

"అంతేతే అక్కా! మనం యెలాగో ఓలాగు సమా ధానపడాలి ప్రస్తుతం...యిలాగే అన్నీ మనకే అజ్ఞాతంగానే జరిగిపోతాయ్...చివరికి పర్యవసానం మాత్రం తెలుస్తుంది" అన్నాడు నిరాశగా వెంకటేశం.

"ఎందుకూ! బావని రానియ్‌రా...యిప్పుడే పంపిస్తాను పద్మావతి అత్తయ్యతో మాట్లాడమని" అంది సరళ. వెంకటేశం అదోలా తనలోతాను నవ్వుకుని వూరుకున్నాడు.

సరళకూడా మరేం అనలేదు. ఆమె మనసు చలించి పోయింది. పరిస్థితులు యెలాంటి విషమస్థితికి దారితీస్తాయో నని భయపడింది. గోడ గడియారం "టంగ్" మని అరగంట కొట్టింది...అయిదున్నరయిం దనుకుంది సరళ. తా నింక వంట కుపక్రమించా లనుకుని ముందుకి నడువబోయింది. సోమేశ్వ రావు వీధిద్వారంగుండా చరచరా వస్తూ "అనుకున్నంత పనీ చేసింది పిన్ని" అన్నాడు కోపంగా, రకీమని కుర్చీలో కూర్చుంటూ. ఏమిటోనని సరళ భయపడింది.

"ఏమయిందండీ...?"

"ఇంకేమౌతుంది... కమలపెళ్ళి నిశ్చయమయింది" అన్నాడు సోమేశ్వరావు వెంకటేశం మొహంలోకి చూస్తూ. వెంకటేశం మొహం మొదటే పాలిపోయివుంది. బావ మాట విని అమాంతంగా కూలిపోయాడు. అతనికి యేడవాలో, నవ్వాలో అర్థంకాలేదు తనకమల పరాధీన అవుతుంది. నత

ఆశలన్నీ మంటలో కలిపి మరీపోతుంది. అయినా కమలమాత్రం యేం చేస్తుందిలే... అస్వతంత్రులు, అనుకున్నాడు. సోమేశ్వర్రావు మొహంలోకి చూడలేకపోయాడు వెంకటేశం ... తలదించుకున్నాడు. సోమేశ్వర్రావు వూహించాడు, బహుశా సరళ జరిగిన విషయాలన్నీ చెప్పివుంటుందని...లేక పోతే తన జీవితసమస్యకి సంబంధమైన కమలపెళ్ళిమాట విన్నా, ఆశ్చర్య సంభ్రమాలు లేకండా నిర్లిప్తంగా వూరు కుంటాడా? అనుకున్నాడు సోమేశ్వర్రావు. సరళకూడా దుఃఖం ఆగిందికాదు. 'ఎంత సాహసమండీ! వరు డెవరు? ఆ సీతారాంగారబ్బాయేనా?'' అంది సరళ.

"ఆ! ఆ కోతిమొహంగాడే! పిన్నికి కావల్సింది ధనం, హోదా, వుద్యోగమేగాని, వ్యక్తుల మనస్తత్వాలూ, వ్యక్తిత్వాలు అవసరంలేదు. అయినా యెంతధైర్యం...నాకు తెలీకండా నాటకం జరిపింది. ఆడదని యెవరనుకుంటారూ?'' అన్నాడు సోమేశ్వర్రావు వుక్రోషంతో.

"మీకెలా తెలిసిందండీ?''

"సీతారాం అప్పుడే పెళ్ళిపత్రికలు కొట్టించేశాడు. మా ఆఫీసులో సత్యంస్నేహితుడొకడున్నాడులే ... వాడి కిచ్చాడా శుభలేఖ... వాడు నన్నడిగాడు ... నేను తెల్ల మొహంవేశాను...ఎంత అవమానం!''

"అప్పుడు కాస్త మెత్తపడిందన్నారుగా''

"ఔను సరళా! వెంకటేశంని తిరిగి రానియ్ చూద్దాం- అంది. ఆమెదృష్టంతా అటేఉంటే వెంకటేశం వస్తేమాత్రం యేం లాభం...నిజంగా కమలను తల్చుకుంటె గుండెలు తరు

క్కపోతున్నయ్... దాని అమాయకపుచూపులు చూస్తుంటే జాలేస్తుంది. యిక్కడితో మనకీ పిన్నిగారి బంధుత్వం అంతరించినట్లే.

"పోనీ మీరు వెళ్ళి అడిగిచూడండీ, యేమంటుందో!" సరళ తాపత్రయం కొలది పద్మావతి మనసు మార్చుకుంటుందేమోనన్న ఆశ మెదుల్తూనే వుం దామెలో. కాని దూరం ఆలోచించలేదు.

"నీకేమైనా మతిపోయిందా సరళా! యింకా అడిగి చూడ్డం యేవిటి? అంతా స్థిరమై విశా హాపత్రాలుకూడా పంచిపెట్టినతరువాత..." "అందుకే గామోసునండీ! కమల యేదో బాధపడుతున్నట్లుగా అగుపించేది."

"పాపం! అదేవిటి చేస్తుంది? ... విచారించటము, బాధపడ్డమేతప్ప ఎదిరించాలాంటిదో యెరుగదు. ఎదిరించినా లాభం లేదని దానికి తెలుసు... పిన్ని చేతులారా దానిజీవితాన్ని ఊరిపోసింది. ఏవిటో కొందరి అదృష్టం అలా ఉంటుంది...సీతారాం వచ్చి సంప్రతింపులు జరుపుతున్నాడని కమల చెప్పిన క్షణంలోనే అనుకున్నా కొంపలా పరిణమిస్తుందోనని—అంత పనీ అయ్యింది" అన్నాడు సోమేశ్వర్రావు. వెంకటేశం యేం మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తున్నాడు తీవ్రంగా. యువకుల వుద్దేశాలు యెలాంటివో తెలుసు సోమేశ్వర్రావుకి. వెంకటేశం విషయంలో భయపడ్డాడు.

"ఏవిటోయ్ అలా ఆలోచిస్తున్నావ్— మ శేం చేస్తాం? మనచేతులనుండి జారిపోయిన వస్తువు మళ్ళీవస్తుందా? విధి అలావుంది— జరిగిందేదో జరిగిపోయింది. నీకంటె కమల

మశీ బాధపడుతుందనుకుంటాను. కాని యెవరం ఏం చెయ్యగలం? వాళ్ళమ్మ చేతిలో కీలుబొమ్మ కమల— కూతుర్ని యేం చేసుకున్నా యెవ్వరము నోరెత్తలేం— ఆ అధికారం లేదు. జీవితంలో యిలాంటి ఒడుదుడుకులు వస్తుంటాయ్ మరి. వాటిని తట్టుకోలేక బాధపడేకంటే, యెదిరించి జీవించటంలోనే వ్యక్తిత్వం ఉంది.'' అన్నాడు సోమేశ్వర్రావు బావమరిదికి ధైర్యం చెబుతూ.

వెంకటేశం యింకా ఆలోచిస్తూనే ఉన్నాడు ... తను రెంటికీ చెడ్డ రేవడయ్యాడు. కమలని చేపట్టాలన్న పట్టుదలతో మద్రాసు వెళ్ళాడు ఉద్యోగానికై మేనమామ మరో మంచి సంబంధం, దానితో పాటు వుద్యోగసిద్ధి మాట్లాడినా, తను పరోక్షంగా నిరాకరించి తిరుగుముఖం పట్టాడు ఎవరికోసం—కమల కోసం— ఆ కమలే యిప్పుడు తనది కాకుండా పోతున్నదంటే యేడుపొచ్చింది వెంకటేశంకి— ఏడవలేకపోతాడు — గుండెల్ని బండ చేసుకున్నాడు. అతనికి తెలుసు. యెంత యేడ్చినా ఫలితం శూన్యమని... ఇక తనకి ఉద్యోగం దొరికినా, లేకపోయినా ఒకటే! తా నా ఊర్లో మొహమెత్తుకు తిరగలేడు, ఏవరేమంటారోనని కాకపోయినా తనుమాత్రం మానసికంగా బాధపడుతుంటాడు— "సరేలే బావా! ఎలాగో మనమే సమాధానపడాలి— సంతృప్తిపడాలి— బాధని అణుచుకోవాలి— గుండెని రాయి చేసుకోవాలి; అసలు నా అదృష్టం అలా యేడుస్తోంది... నేను నా జీవితంలో యే లక్ష్యం చేరలేను... దాని కెవ్వరూ బాధ్యులు కారు. నేనే!" అన్నాడు వెంకటేశం బాధపడుతూ. సోమేశ్వరరావుకి, సరళకీ మనసు

చివుక్కుమన్నది.

"అంతా అంతేనోయ్—అదృష్టం అన్నది ప్రతివాళ్ళ జీవితంలోనూ ఉంటుంది...కాని ఆసమయం రావాలి—" అన్నాడు సోమేశ్వరరావు అతని మనస్సు మార్చాలని

"ఇక ఆ సమయం వచ్చినా, రాకపోయినా ఒకటే బావా! జీవితంలో ఒక విలువైన వస్తువును పోగొట్టుకున్న తరువాత యింక మిగిలిందేమిటి? అంతా నిరాశే! చీకటే! నా దురదృష్టంకొద్దీ ఆ వుద్యోగంకూడా ఇంతవరకూ దొరకలేదు. అదే చివరికి నా జీవితపతనానికి కారణమయ్యింది."

"ఎందుకోయ్ వెంకటేశం, అంత బాధపడతావ్... కాస్త ధైర్యం చిక్కబట్టుకో. ఉద్యోగం దొరుకుతుందిలే... ఎవరికంటె తక్కువైపోయావని..." అన్నాడు సోమేశ్వరరావు ఓదారుస్తున్నట్టుగా. వెంకటేశం అదోలా నవ్వాడు.

"ఇక ఉద్యోగం చేసే అవసరంకూడా లేదులే బావా! ఆ వున్నకాస్త ఆస్తిని కనిపెట్టుకుని ఉంటే చాలు — జీవితం సాఫీగా వెళ్ళిపోతుంది."

"వెంకటేశం..." అంది త్రుళ్ళిపడుతున్నట్టు సరళ.

"ఔ నక్కా! నా కింక ఉద్యోగం చెయ్యాలన్న ఆసక్తి లేదు..."

పిచ్చిగాని పట్టలేదు కదా" అన్నాడు సోమేశ్వరరావు.

"ప్రపంచానికే పిచ్చిపడుతున్నప్పుడు నాకు పిచ్చిపట్టడంలో ఆశ్చర్యంలేదు...అయినా నాకేం పిచ్చిలేదులే—"

"ఏమిటోలే, నీ వేదాంతం! యింత ధైర్యశూన్యుడ్వవుతే యెలా చెప్పు!"

"నీకు నేను చెప్పేపాటివాణ్ణి కాదు బావా! నువ్వే అర్థం చేసుకోగలవు" అన్నాడు వెంకటేశం వ్యంగ్యంగా తనభావాన్ని వ్యక్తపరుస్తూ. వెంకటేశంకి నచ్చచెప్పటం ప్రస్తుతంలో లాభం లేదనుకొని వూరుకున్నాడు సోమేశం

మరుసటి రోజే వెంకటేశం స్వస్థలంకి బయలుదేరాడు అక్క, బావ, యెంతచెప్పినా చెవిని పెట్టుకోలేదు. వాళ్ళని తిరిగి తనే ప్రాధేయపడ్డాడు, మరేం బలవంతం చేయొద్దని— సరళ కన్నీరుకారేటంతవరకు యేడ్చింది—తమ్ముడు యింతవరకు చదువుకుని యిల్లాంటి పరిస్థితికి వస్తాడని ఆమె యెప్పుడూ అనుకోలేదు. అప్పుడప్పుడు వస్తుంటాకే'—అని చెప్తూ వెళ్ళిపోయాడు వెంకటేశం భారంగా అడుగులు వేసి బండి నెక్కాడు ఎడ్లమెళ్ళోవున్న మువ్వల గలగలలు వినిపించినంతవరకు సోమేశ్వరాప్రు, సరళ వీధిఅరుగుమీాదే నుంచున్నారు—

"బాబుగారూ! పద్మావతమ్మగారు పిలుస్తున్నారు" అంటూ ఓమనిషి వచ్చి చెప్పాడు. సోమేశ్వరాప్రుకి వుక్రోషం ఉబికివచ్చింది. "ఫో వెధవా —రానని చెప్పు — యిప్పుడేకాదు—యిహ ఆ యింటి గడప నా జీవితాంతం వరకు తొక్కనని చెప్పు" అంటూ విసురుగా లోపలికి పోయాడు సోమేశ్వరాప్రు. సరళ ఆతని వెనువెంటనే కన్నీళ్ళు ఒత్తుకుంటూ పోయింది. ఆ వచ్చిన పనిమనిషి స్తబ్ధుడైపోయాడు. కోపమన్నది యెరుగని సోమేశ్వరాప్రు కింత కోపం యెందుకొచ్చిందా—? అనుకుని వెళ్ళిపోయాడు. వాడికేం తెలుసు లోతుపాతులు!

సోమేశ్వర్రావు ఒహాటే నిశ్చయానికి వచ్చాడు-పద్మా వతిస్వయంగావచ్చి పిల్చినాసరే ఆ యింటికి పోరాదనుకున్నాడు పోడు కూడాను— అంత ఆత్మవిశ్వాసం వుందతనిలో. గడి యారం పదికొట్టింది. ఆఫీసుకి బయలుదేరాడు— పోస్టుమాన్ యెదురుగావచ్చి ఓ కవరు యిచ్చిపోయాడు. విప్పిచదివాడు సోమేశ్వర్రావు. వెంకటేశంకి ఆ వూర్లో సెంట్రిల్ బ్యాంకులో వుద్యోగం ఇచ్చారు— అదీ ఆ వుత్తరం. సోమేశ్వర్రావు కళ్ళవెంబడి రెండు కన్నీటిబిందువులు రాలిపడినయ్ వుత్తరంపై. 'దురదృష్టవంతుడు' అన్నమాటలు మాత్రం అతని నోటినుండి వచ్చాయి. వుత్తరం చించిపారేశాడు, ఇంకేం చేస్తాడు? తరుణం మించిపోయిం తరువాత వుద్యోగం! సోమేశ్వర్రావు మనసు వికలమైపోయింది. ఆఫీసుకి పోవాలన్న ఆసక్తి లేకపోయినది. ఆరోజు శలవు పెట్టి వుండిపోయాడు. దూరంగా రైలుకూత విన్పించింది... ఆ బండిలోనే వెంకటేశం వెళ్ళిపోతున్నాడు. సోమేశ్వ(రావుగుండెలు చీల్చుకుపోయాయ్—చెవులు గట్టిగా మూసుకున్నాడు—

# ప్రాప్తి

మేడమెట్లు దిగుతూ సరళ సోఫామీద కూర్చుండటం చూచి మరీ వేగం హెచ్చించి చప్పున క్రిందికి దిగింది జయ.

"ఇంతసేపూ యెదురు చూశానే.. యింతవరకూ యేం చేస్తున్నావే!" అంది జయ సరళ ప్రక్కనే కూర్చుంటూ. సరళ నవ్వుతూ

"నీలా నాకెలా అవుతుందే—యింటిపనులన్నీ అమ్మతో పాటు నేనూ చక్కబెట్టుకురావాలిగా" అంది సరళ.

"పోనీగాని యేమైనట్టు నీ చదువు! మొదటి నిర్ణయమే స్థిరమయిందా?"

"అంతే జయా! నా చదువు కిహ స్వస్తిచెప్పాల్సిందే!"

"నువ్వింకా చదువుతే బావుండేది."

"బావుండేదే...కాని అంత తాహతుండొద్దూ జయా!' అంది సరళ. జయ బుంగ మొహం వేసుకుంది.

"ఎప్పుడూ తాహతుల్నే తెచ్చిపెడతా వెందుకనో!" అంది జయ

"ఔను జయా! చదువుకుందుకు డబ్బుండాలి. నాలాంటి సామాన్యుల కెలాసాధ్యమౌతుంది చెప్పు?"

"వున్నదాంతో నే సంతృప్తిపడుతూ సామాన్యజీవితంలో చదువుకుంటున్నవాళ్ళు లేరంటావా?"

"వున్నారులే...కాని మా నాన్నకి నన్నింకా చదివించాలని లేదు జయా! నన్నో యింటిదాన్నిగా చెయ్యాల

ఆయన అభిలాష" అంది సరళ సిగ్గుతో మొహం దించుకుంటూ.

"అబ్బో! అవుతే నువ్వు పెళ్లికూతురివి కాబోతున్నావన్నమాట" అంది నవ్వుతూ కళ్ళు పెద్దవిగాచేస్తూ జయ.

"అప్పుడే కాదులేవే!"

"ఇప్పుడు కాకపోతే, మరికొన్నాళ్ళు పోయాక; ఔనా మరి..."

"నన్నంటున్నావు గానీ, నువ్వుమాత్రం కావేవిటి?"

"నామాట వదిలేయ్ సరళా...ఆ, అవుతే పెళికొడుకెవరో తెలుసుకోవచ్చా?" తమాషాగా అడిగింది జయ.

"ఏమో నాకేం తెలుసే—యింకా నిశ్చయంకాలేదు."

"పెళ్ళనగానే సంబరంకాదు సరళా! అన్ని విషయాలు బాగా ఆలోచించి పెళ్ళిచేసుకో."

"మన ఆలోచ నేముందిలేవే! పెద్దలున్నారుగా ..అవుతే నువ్వెంతవరకు చదవాలనుకొంటున్నావే?

"డాక్టరీ చదవాలనివుందే..."

"అప్పుడు నన్ను మర్చిపోవుకదా!" నవ్వుతూఅంది సరళ.

"చాల్లే! ఎందుకు మర్చిపోతాను?" అంది చిలిపిగా జయ.

"ఏమోలే...కాలం మారిపోయిందికదూ! పాత జ్ఞాపకాలుండవు..." అంది సరళ మాటలు తేలుస్తూ. చివరికిద్దరూ నవ్వుకున్నారు.

"నీ వేళాకోళానికేం గానీ, జానకిఇంట్లో పార్టీ వుంది. వస్తావటే?" అంది జయ.

"నాకు పనుంది జయా! యిప్పుడు రాలేను..." మరేం అనుకోకేం? వస్తాను మరి..." అంటూ వెళ్ళిపోయింది సరళ. జయ వాచీ చూచుకుని మళ్ళీ తొందరగా మేడమెట్లెక్కిపోయింది.

కొద్దిదినాలు గడిచిపోయాయి. సరళవివాహం సక్రమంగా జరిగిపోయింది. పెళ్ళయిన పది దినాలతరువాత జయ సరళ యింటికివెళ్ళింది. సరళ జయని ఆహ్వానించింది. జయ కూర్చుంటూ—

"ఏంవిటే సరళా! పెళ్ళయింతర్వాత దర్శనాలే లేకపోయాయ్—మీ ఆయన విడిచిపెట్టలేదా?" అంది నవ్వుతూ.

"వూరుకుందూ! వీలుకుదిరితేగా రావటం మరి... నిన్నటివరకు బంధువులుండనేవున్నారు." అంది సరళ.

"ఆ! అన్నట్టు అడగాలని మర్చిపోయాను, నీ ఆయన ఎంతవరకు చదువుకున్నారేవిఁటి?"

"ఇంటరు చదువుతూ మానేశారుట"

"ఓస్! యింతేనా! ఏం వుద్యోగం చేస్తున్నారు?" జయ మొదట్లోనే అంత చులకన కనబర్చటం సరళకి నొప్పికలిగించింది.

"ఏదో ఆఫీసులో క్లర్కు పనట"

"గుమాస్తాయా! నా సానుభూతిని యెలా తెలియజెయ్యాలో అర్థంకాకుండా వుందే సరళా" అంది జయ కాస్త

విచారాన్ని సూచిస్తూ. సరళ కేమీ అర్థం కాలేదు సానుభూతెం దుకో! "సానుభూతా? ఎందుకూ!" ఆశ్చర్యంగా అడిగింది.

"ఎందుకా? నువ్వో గుమస్తాకి భార్యవయ్యావని"

"అవుతే యేమయిందీ?"

"ఏం? నీకేం బాధకన్పించటంలేదూ?" అదోలా చూస్తూ అంది జయ.

"లేదే..." తెల్లమొహం వేసింది సరళ.

"అవుతే నీలో అమాయకత్వం బాగా పేరుకుందన్న మాట"

"ఏమిటో నాకర్థంకాలేదే జయా!" విసుగ్గా అంది సరళ.

"ఓ గుమస్తాని పెళ్ళాడి యేంసుఖం అనుభవిస్తావే మరి...?" అంది జయ... అదీ తన సానుభూతికి కారణం. ఆమెదృష్టిలో గుమస్తాలు కీటకాల్లా అగుపిస్తున్నారు. సరళకి ఆమె అభిప్రాయం అంతగా నచ్చలేదు.

"ఏం, వాళ్ళల్లో మానవత్వం ఉండదనా? వాళ్ళు జీవించలేరంటావా?"

"జీవించలేరనికాదు సరళా! జీవిస్తారు... కాని జీవితంలో యెప్పుడూ పేదరికంతో పోరాడుతూంటే... దాంతో వారి మానవత్వంలో మార్పు అప్రయత్నంగానే వచ్చేస్తుంది";

"దానికేం చేస్తాంలే జయా! పేదరికం ప్రత్యేకవ్యక్తికి సంబంధించింది కాదు— సంఘానికి సంబంధించిందన్నాడో రచయిత. పేదవాళ్ళెంతోమంది వున్నారు సంఘంలో" అంది సమర్థించుకుంటూ సరళ.

"ఇంత సహనంతో యెలా ప్రతిఘటిస్తున్నావే

"ప్రతిఘటించాల్సిన క్లిష్టపరిస్థితులు రాలేదుకదూ జయా!"

"ఐతే నువ్వు ఆనందంగానే వున్నావంటావ్?" అంది జయ. ఆమె ఆశ్చర్యంగానేవుంది సరళ యెలా సహిస్తోందా అని... ఆమె మనస్తత్వం, పెరుగుతున్న వాతావరణం అట్లాంటివి.

"కాదు—తృప్తిగానే జీవిస్తున్నా; జీవిస్తానుకూడా" అంది సరళ చిన్నగా నవ్వుతూ.

'భర్త 'గుమాస్తా'అని చెప్పుకోవటం యెంతచిన్నతనం. నేనవుతే నిరాకరించి శాశ్వత బ్రహ్మచారిణిగా వుండిపోయే దాన్ని. కావలిస్తే...మా మేనమామ వున్నాడు లే...మాంచి ఆస్తిపాస్తులున్నాయి. అతనికి నన్నిస్తామంటే అతను గుమస్తా గిరి వెలగబెడుతూండటంవల్ల యిష్టంలేదని చెప్పేశాను.... తెలుసా సరళా!" తన గొప్పతనాన్ని చెప్తూ తూ... జయ అలాఅన్నా సరళకి చిన్నతన మనిపించ లేదు.

"నీకూ, నాకూ చాలా వ్యత్యాసాలున్నాయి జయా! నువ్వు ఆఫీసరుకూతురివి — నేను సామాన్యుని కూతుర్ని; నాకు గుమస్తాలుకాక యింకెవరు భర్తగా వస్తారు చెప్పు"అంది నవ్వుతూ సరళ.

"నువ్వెప్పుడూ యీ వ్యత్యాసాలు తెచ్చిపెడతా వెందుకే సరళా!"

"అందులో ప్రాముఖ్యత వుంది కాబట్టి"

"నేను నమ్మను..."

"నాకు నమ్మకంవుంది"

"పోనీలేగానీ, ఆయనకి ఆస్తిపాస్తి లేమన్నా వున్నాయా!" అంది జయ ...ఎందుకో ఆమె కివన్నీ తెలుసుకోవాలన్న ఆసక్తి!

"ఆస్తులేం లేవు జయా! అయినా నాకు సంతృప్తిగానే వుందే! ఎందుకనంటే, మా హృదయాలు అల్పసంతుష్టిగా తయారై స్థిరపడిపోయాయ్." అంది సరళ. జయ ముఖం ముడుచుకుంది.

"వూరుకుందూ! మాట్లాడితే 'మా' 'మీ' అన్న భేదాలు తెస్తుంటావ్... సరేగాని... యెప్పుడు వెళ్ళిపోతున్నావ్ అత్తారింటికి?" అంది జయ.

"అప్పుడే వెళ్ళను జయా! ఆయన కీ వూరు బదిలీ అయ్యే సూచనలు కన్పిస్తున్నాయంట... అందుకని ప్రస్తుతంయిక్కడే వుంటాను," అంది సరళ... జయ టైంచూసుకుంటూ—

"మైగాడ్! అప్పుడే ఎంతవేళయిపోయింది! వస్తానే మరి..." అంటూ వెళ్ళిపోతుంది. జయ అభిప్రాయాలకి సరళ నవ్వుకుంది.



జయ మేనమామ కామేశం, అతనికి మంచి స్థితిగతులున్నయ్.... వూరికేనే కూర్చోవటం యెందుకని వున్నవూర్లో కలెక్టరేట్‌లో గుమస్తాగిరి వెలిగిస్తున్నాడు. అతనికి జయని ఇవ్వాలని వుంది... అదేవిషయం జయతల్లి కూడా చెప్పింది తమ్ముడితో. కామేశం యింటరు చదివాడు... జయ కూడా యింటరు చదువుతూండటం అతని కిష్టం లేదు.

"మీ తమ్ముడేమంటున్నాడు లక్ష్మీ!" అన్నాడు శంకర

రం—జయతండ్రి, భార్యతో. అతని అభిప్రాయం స్థిరపడింది జయకి మేనరికం చేస్తేనే మంచిదని.

"వాడేమంటాడండీ! జయ నింకా చదివించడటం యిష్టంలేదు వాడికి."

"ఏం...?"

"వాడే చదివింది ఇంటరు... ఓపార్టు పోయిందికూడా. జయకూడా ఇంటరుచదివితే తనకేం గౌరవముంటుందీ అంటాడు."

"ఔన్లే! వాడిఅభిప్రాయం బాగానేవుంది. కాని జయకి చదవాలనేవుంది. అసలు మీతమ్ముణ్ణి పెళ్ళిచేసుకోవటం దాని కిష్టంలేనట్లే అగుపిస్తుంది" అన్నాడు శంకరం.

"దానిమొహంలెద్దురూ! యిష్టంకాక యేమయిందీ? మీకిష్టంలేదందురూ..." అంది లక్ష్మి సూటిగా భర్తముఖం లోకి చూస్తూ,

"అబ్బే...నాకేం ఆ అభిప్రాయం లేదు లక్ష్మీ! మన హోదాకితగ్గ అల్లుడు కావాలన్న వాంఛ ఓవేపునవున్నా, మీ తమ్ముడికున్న ఆస్తిపాసులు నావాంఛకి కళ్ళెంవేసిలాగేస్తు న్నయ్" అన్నాడు శంకరం. లక్ష్మిముఖం వికసించింది,

"ఔనా మరి... ఎంతహోదాలోవున్నవా డొచ్చినా డబ్బుంటూ వుండొద్దటండీ!" అంది నవ్వుతూ.

"అందుకేకదూ, నేనూ 'వూ' కొట్టాను. అవుతే చదువు మానిపించేయమంటున్నా డన్నమాట."

"ఆ మాట సూటిగా చెప్పకపోయినా, అర్థంమాత్రం అదే."

"సరే—అవుతే మాన్పించేద్దాం — అని యిలా అన్నాడో లేదో జయ తనగదినుండి వస్తూ,

"ఏమిటినాన్నా, మాన్పించేద్దామంటున్నారు?" అంది. శంకరంకి పచ్చివెలక్కాయ నోట్లో పడినట్టయింది."

"ఏమీ లేదే అమ్మాయ్" అనేశాడు నిజాన్ని తననోటితో చెప్పలేక లక్ష్మి అందుకుంది

"దాస్తున్నారేం? నీచదువు మాన్పించేయమంటు న్నాడే జయా!" అంది లక్ష్మి. జయ తృళ్ళిపడింది.

"ఎవరమ్మా...? అంది జయ.

"కామేశం మావయ్యే..." అంది లక్ష్మి నవ్వుతూ. జయకి వుక్రోషం పొంగిసలాడింది. "ఆయనెవరు, నాచదువు మాన్పించడానికి?" అంది కోపంగా.

"అంత కోపమెందు కమ్మాయ్... కామేశం మెవ రంటావేమిటి?" అన్నాడు శంకరం.

"తప్పు జయా! అంత తొందరపాటుండకూడదమ్మాయ్. ఆ మూడుముళ్ళూ పడ్డాక ఈ తొందరపాటుంటే యింకేం చెప్పను...?" అంది లక్ష్మి. జయ కిప్పు డర్థమయింది. తను ఏవ్యక్తినుండి దూరంగా వుండాలనుకుందో, ఆ వ్యక్తి మరింత సన్నిహితుడౌతున్నాడు. అతనికోసం చదువుమానేయాలి. తన జీవితంలో మరి భవిష్యత్తు శూన్యం... అనుకుంది. ఆమెకి ఆవేశం ఆగిందికాదు.

"అందుకా చదువు మాన్పిస్తామంటున్నారు...నేను మొదట్లోనే చెప్పేశానమ్మా! మామయ్యని పెళ్ళిచేసుకోనని" అంది వుద్రేకంతో జయ.

"చూశావుటే లక్ష్మీ! నేను చెప్పలేదూ?" అన్నాడు శంకరం భార్య మొహంలోకి చూస్తూ. లక్ష్మికి కోపం వచ్చింది. కోపంలో వుడుకుమోత్తనంకూడా వుంది. తన తమ్ముడికేం తక్కువయిందని.

"మీరూరుకోండి... కామేశంకి యేం తక్కువనే పెళ్ళిచేసుకోవు? ధనం లేదా? కావల్సినంత వుంది; చదువుంది, వుద్యోగముంది ఇంకేంకావాలి?" అంది లక్ష్మి.

"ఇవన్నీ వుండగానే సరా...చేసే వుద్యోగం ఏంటి? గుమస్తా యేగా! నాకవసరంలేదు." అంది చీత్కరించుకుంటున్నట్టుగా. లక్ష్మి మనసు చివుక్కుమంది.

"ఇంకెవరు కావాలే? నిన్ను పెళ్ళాడాలని ఆఫీసర్లెవరూ వచ్చి పడిపోవటంలేదు" అంది లక్ష్మి కోపంగా.

"వస్తారమ్మా! వాళ్ళే వస్తారు...నన్నింకా చదువుకోనీయండి" అంది జయ విసుగ్గా.

"వీల్లేదు. ఈరోజుతో నీచదువుకి స్వస్తి..." అంది కఠినంగా లక్ష్మి. అంత కఠినంగా అన్నందుకు తరువాత బాధపడింది. మళ్ళీ కాస్త చల్లబడి అంది.

"నీకేం పిచ్చిగాని పట్టలేదు కద జయా! గుమస్తాఉద్యోగం మాత్రం వుద్యోగంకాదూ? పోనీ పేదరికం అనుభవిస్తున్నాడా అంటే, కావల్సినంత ఆస్తి వుంది. యింకేంకావాలి"

"నువ్వెన్నైనా చెప్పు నాకిష్టంలేదమ్మా" ఖచ్చితంగా చెప్పేసింది జయ. తల్లీ కూతుళ్ల మధ్య వాదం పెరిగిపోతున్నందుకు శంకరమే జోక్యం కలుగజేసుకున్నాడు.

"అలాగంటె యెట్లా అమ్మాయ్...బీరకాయ పీచు లాంటి ఈ రెండు వంశాలమధ్య గల సన్నిహితత్వం యెలా పోగొట్టుకుంటాం చెప్పు." అన్నాడు శంకరం.

"అందుకని నాకిష్టంలేని భర్తను ముడిపెడతారా!" అంది యేడుపుస్వరంలో జయ. శంకరం చిన్నగా నవ్వాడు.

"నీ అయిష్టతలో ఓ ప్రత్యేకతవుంది జయా! ఆయన గుమస్తాజీవితం గడుపుతున్నాడనే కదూ, నీచిన్నచూపు. అది మాత్రం వుద్యోగంకాదూ? వారికిమాత్రం హృదయం, వ్యక్తిత్వం. వుండవూ? గుమస్తాగిరంటే అంతగా అసహ్యపడతావెందుకో నా కర్థంకాదమ్మాయ్... అందరూ ఆఫీసరుల వ్వాలనివుంటె మరి గుమస్తాలెవరు?" అన్నాడు శంకరం. సరళ అన్నమాటలే తండ్రినోటినుండి మరి కాస్త పొడిగింపు తో... తనిక యెంత ప్రయత్నించినా లాభంలేదనుకుంది జయ.

"ఎందుకు నాన్నా యింతవుపన్యాసం? మీరంతగా పట్టుబడితే నేనేం చేస్తాను? నే ననుకున్నా కాస్త హోదాలో వున్న వ్యక్తిని వివాహం చేసుకోవాలని ... నా ఆశయాలు కలలో మాటగా మాసిపోయాయ్. నా ఆశాసౌధాలు కూలి పోయాయ్. ఏంచేస్తాను! మీయిష్టం..." అంది జయ తల దించుకుంటూ. లక్ష్మి పెదాలపై చిరునవ్వు తొణికిసలాడింది. శంకరం సంతృప్తిగా నవ్వాడు.

"అమ్మయ్య! యిప్పటికి గాబోను, కాస్త త్రోవన పడ్డావ్...హోదాలో యేముంటే! ధనంకి లోటులేకుండా వుండాలిగా..." అంది లక్ష్మి కూతురుతల నిమురుతూ.

"వుద్యోగం లేకపోయినా అంత బాధలేదమ్మా" అంది జయ. ఆమె ఇంకా ఆ గుమస్తాగిరిపై న్యూనత విడిచిపెట్టలేదు. శంకరం నవ్వుతూ "అంతేగాని గుమస్తాని మాత్రం పెళ్ళాడ నంటావ్—పిచ్చి పిల్లా! నీ అమాయకత్వాని కేమనాలో అర్థంకాకుండావుందే. ఏ వుద్యోగమవుతే యేమమ్మా ... వున్నదాంతో సంతృప్తిపడాలిగాని, నేనింత హోదాలోవున్నా నన్నమాటేగాని, నాకేం శాంతివుంది చెప్పు?" అన్నాడు. జయ యేం మాట్లాడలేదు.

అప్పుడే బయట పోస్టుమేన్ కేకవిని శంకరం వెళ్ళి వుత్తరం తీసుకుని విప్పిచదువుతూనే భార్య, కూతురు దగ్గరకి వచ్చాడు వుల్లాసంగా.

"ఎక్కడినుంచండీ వుత్తరం?" ఆడవాళ్ళ స్వభావం పోగొట్టుకోకుండా ప్రశ్న వేసింది లక్ష్మి.

"మీ తమ్ముడి దగ్గర్నుండి" అన్నాడు శంకరం నవ్వుతూ.

"ఏం రాశాడండీ?"

"మీ అమ్మా, అతడూ, కలిసి రేపువుదయం బండిలో వస్తున్నారుట."

"అన్నీ నిశ్చయించుకుపోవటానికే ననుకుంటాను" నవ్వుతూ అంది లక్ష్మి.

"మీ వాళ్ళకి మరీ తొందరగా వుందిలెద్దూ!"

"ఇంక కాలయాపన చెయ్యటం మా అమ్మ కిష్టం లేదండీ... 'శుభస్య శీఘ్రం' అంటుంది."

"మనమేం తక్కువ తిన్నాంలే... మనమూ అలాగే అందాం..." అన్నాడు శంకరం నవ్వుతూ.

జయ తలదించుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయింది. నిస్స హాయతవల్ల యెదిరించలేకపోతోందిగాని, ఆమె హృదయంలో బాధగానేవుంది. ఏ గుమస్తా జీవితాన్ని వ్యాఖ్యానించి తన స్నేహితురాలిపై సానుభూతి చూపిందో, ఆ గుమాస్తా జీవితం లోకే తనూ వెళ్తోంది సరళ మొహం యెలా చూడ్డం! తను ఆమెను ఓన్నపుచ్చింది... యీ ఆలోచనలతోనే ఆమె హృద యం బరువెక్కింది...

అనుకున్నట్టుగానే జయ చదువుకి స్వస్తిచెప్పింది. లోలోపల యెంత బాధపడింది, తన వివాహం మాట వస్తే చదువు మానేసినందుకు. కాని యేంచేస్తుంది? పరిస్థితు లిలా పరిణమించాయి. కామేశం, వాళ్ళమ్మ రావటం పెళ్ళిమాటలు నిశ్చయించుకుని పోవడం జరిగిపోయినది జయ కాలేజీకి వెళ్ళటం మానేసిన అయిదోరోజున సరళయింటికి వెళ్ళింది. తనహృద యంలో మరుగుతున్న బాధని సరళను క్షమాపణ కోరుకుని చల్లార్చుకోవాలనుకుంది.

"రావే జయా! యిప్పుడొచ్చావేం? కాలేజికి పోలేదా" అంది సరళ జయని కూర్చోమంటూ. జయ నిట్టూర్పుతో కూర్చుంది. నిజంగా సరళ మొహంలోకి చూడ్డానికే ఆమెకి భయమేస్తోంది.

"లేదే! చదువుకి స్వస్తి చెప్పానే" అంది బాధగా. సరళ కేం అర్థంకాలేదు. అకస్మాత్తుగా యెందుకీ మార్పు వచ్చిందా అనుకుంది.

"ఏం? ఎందుకనీ?" అంది సరళ ఆశ్చర్యపోతూ.

"నా పెళ్ళి నిశ్చయమయ్యిందే!" అంది ముఖం దించుకుని.

"అరె...నాకు తెలీదే! ఎవ రా అదృష్టవంతుడు?" అంది నవ్వుతూ సరళ.

"యీ దురదృష్టవంతురాలికి అదృష్టవంతు డెలా తటస్థపడతాడులే." అంది మెల్లగా. సరళ అర్థంచేసుకుంది, జయ యెందుకో బాధపడుతూందని.

"ఎందుకే అలాబాధ పడతావ్." అంది సరళ ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

"ఔను మరి... నీ గుమస్తాభర్తని గురించి ని న్నంతగా విమర్శచేశానా... అల్లాంటి గు మా స్తా యే నాకూ భర్త అయ్యాడు" అంది జయ. కాని సరళ నమ్మలేదు...

"వూరుకుందూ! వేళాకోళానికి వేళా, పాలా వుండొద్దూ!" అంది నవ్వుతూ సరళ.

వేళాకోళం కాదు సరళా! నిజంచెబుతున్నా. నా మేనమామ వున్నాడని చెప్పలేదూ... అతనే చివరికి... "అంది తనేదో అరణ్యామధ్యానికి పోతున్నట్టుగా బాధపడుతూ. సరళకీవ్వాడు నమ్మకతప్పిందికాదు.

"బాధపడి సాధించే దేముందే జయా! ఎవరి కేది ప్రాప్తమో యెవరికి తెలుసు? ఏదైనా మనమంచికే అనుకో కూడదూ?" అంది బోధపర్చేధోరణిలో సరళ.

"ఎలాగో మనం సంతృప్తిపడాలి. మరి... నే నప్పుడన్న వన్నీ మనసులో వుంచుకోకేం..." అంది జయ.

"పిచ్చిగాని పట్టలేదుకదా! చంపక వూరుకో మరి... ఆ! అవుతే పెళ్లెప్పుడూ?"



"సరిగ్గా పదిహేనురోజు లుందే!"

"Good news జయా! ఆఁ, చెప్పటం మర్చిపోయాను. మా ఆయనకి యిక్కడికే బదిలీఅయింది" అంది నవ్వుతూ సరళ.



"అదృష్టవంతురాలివి సరళా" అంది జయ నవ్వుతూ.

"నువ్వుమాత్రం కానట్టు..." కాస్త గట్టిగా నవ్వుతూ.

"సరే...వస్తానే మరి...సాయంకాలం యింటికొస్తావు కదూ!" అంటూ లేచింది జయ. సరళ కూడా లేచి ఆమె వెనువెంటనే నడుస్తూ



"అలాగే...తప్పకుండా వస్తాను" అంది సరళ. జయ కనుచూపుమేర దాటేవరకు సరళ గుమ్మంలో నిల్చుని తరువాత లోపలికొచ్చేసింది.

---

# కథావాహిని

## 15

ఓగేటి కథలు